## మహాకాలుని ప్రేరణ - అతి ముఖ్య సూచన

క్రాంతి ధర్మీ సాహిత్యము అనే పేరుతో ప్రసిద్ధి గాంచిన ఈ పుస్తకమాల క్రాంతిదర్శీ ప్రజ్ఞాపురుషుడు పండిత శ్రీరామశర్మఆచార్య గారిద్వారా 1989 నుండి1990 మధ్య కాలములో తమ మహాప్రయాణమునకు ఒక సంవత్సరము ముందు ఒక ప్రవాహముగా సృజించబడినవి. ఇరవై చిన్న చిన్న పుస్తకములుగా వున్న ఈ సాహిత్యము గురించి మన ఆరాధ్య పరమపూజ్య గురుదేవులు (పండిత శ్రీరామశర్మఆచార్యగారు) ఇలా వివరించారు – “ ఇవి నా విచారక్రాంతి యొక్క బీజములు. ఇవి కొద్దిగా అయినా సరే విస్తరింపబడితే మనుష్యులును కుదిపివేస్తాయి. సంపూర్ణ విశ్వము యొక్క పటము (MAP) నే మార్చివేస్తాయి”. నిజానికి ఈ పుస్తకములలో కేవలము ఆలోచనలే కాదు ఒక మహాక్రాంతి యొక్క జ్వాల లేక మంట వున్నది. యుగపరివర్తన దిశ నిర్ధారింపబడింది.

యుగఋషి తమ జీవితమంతా, జీవించే కళ నుండి నిగూఢ ఆధ్యాత్మిక విషయములు మరియు సమాజనిర్మాణము నుండి వైజ్ఞానిక–ఆధ్యాత్మిక ప్రధానమైన సమగ్ర సాహిత్యము ఏదయితే రాస్తూ వచ్చారో దానిని మొత్తము త్రాసులో ఒక తక్కెడలో పెట్టి రెండవ వైపు సూత్రప్రాయముగా వ్రాయబడిన ఈ పుస్తకములను పెడితే వీని బరువే ఎక్కువ. ఈ అమూల్య సాహిత్యాన్ని ఎవరైనా లాభమువద్దు, నష్టమువద్దు (NO PROFIT-NO LOSS) పద్ధతిన అచ్చుగుద్ది వ్యక్తివ్యక్తికీ అందచేయమనే నిర్దేశము గాయత్రీపరివార్ యొక్క అధిష్ఠాత పరమపూజ్య గురుదేవులు స్వయముగా ఇచ్చారు. వీటిని ఎవరైనా ప్రచురణ చేయవచ్చు, ఎవరికైనా పంచవచ్చు. వీటిని ఎంత ఎక్కువమంది వ్యక్తులకు ఏ పాఠకుడు, పరిజనుడు అందచేయగలడో అతను అంత ఎక్కువ పుణ్యాన్ని పొందగలడు.


*Global Head Quarters :* **GAYATRI TEERTH**
*Shanntikunj, Haridwar, Pin- 249411*
*Phones: (0133)2460866, 2461955, 2460309*
*Phones: (0133) 2460866 E-mail : shail@del2vsnl.net.in*
*website : www.gayatripariwar.org, www.awgp.org*


మహాపూర్ణాహుతి పుస్తకమాల – 2

# 21వ శతాబ్ది - ఉజ్జ్వల భవిష్యత్తు - 2

ద్వితీయ భాగము




మానవుడు తన భాగ్యానికి తానే నిర్మాత.
మేము ఉత్కృష్టులమై ఇతరులను శ్రేష్ఠులుగా చేస్తే
నవయుగము తప్పక వస్తుంది

మహాపూర్ణాహుతి పుస్తకమాల - 2

# 21 వ శతాబ్ది - ఉజ్జ్వల భవిష్యత్తు - 2

**ద్వితీయ భాగము**

హిందీ మూలరచన :

వేదమూర్తి, తపోనిష్ఠ, యుగద్రష్ట

**పండిత శ్రీరామశర్మఆచార్య**

అనువాదము :

**డా॥ మారెళ్ళ శ్రీరామకృష్ణ**

ఎమ్.ఎస్‌సి, పిహెచ్.డి.


ముద్రణ

**గాయత్రి చేతనా కేంద్రము**

అశ్విని హౌస్ దగ్గర, హెచ్.పి.రోడ్, మూసాపేట్,

హైదరాబాద్-500018.

ఫోన్స్ : 040-23700722, 32986922, 09392506888

E-mail : hyderabad.ap.in@awgp.org, info@aswini.com

## విషయసూచిక



ఓం భూర్భువః స్వః తత్సవితుర్వరేణ్యం
భర్గోదేవస్య ధీమహి ధియో యో నః ప్రచోదయాత్.

# 21వ శతాబ్ది - ఉజ్జ్వల భవిష్యత్తు - 2

## పరిచయము

కాలచక్ర స్వభావమే పరివర్తన. ఒక పెద్ద పరివర్తన విస్తృతక్షేత్రములో తీవ్రవేగముతో జరిగినప్పుడు దానిని క్రాంతి అంటారు. క్రాంతుల మధ్యలో కొన్ని మహాక్రాంతులు కూడా ఉంటాయి. అవి చాలా కాలము వరకు ప్రజల యొక్క మనస్సులలో తమ ప్రభావాన్ని చూపిస్తూనే వుంటాయి. ప్రస్తుతము యుగసంధి కాలము - ఒక మహాక్రాంతికి నాంది. మహాక్రాంతులన్నీ కేవలము సృజనకు, సంతులనకు మాత్రమే ఆవిర్భవిస్తాయి.

మహాకాలుడు సంకల్పించినప్పుడు పరివర్తనము ఆశ్చర్యకరమైన రీతిలో అమితవేగముతో జరుగుతుంది. రావణదమనము, రామరాజ్యస్థాపన , మహాభారతయుద్ధము పురాణ కాలపు ఉదాహరణలు. చరిత్రలో బుద్ధునియొక్క ధర్మచక్రప్రవర్తన, సామ్యవాదము మరియు ప్రజాతంత్రము యొక్క సశక్త ఆలోచనాసరళి యొక్క విస్తారము, దాస్యఆచారము యొక్క సమాప్తి మొదలయినవి ఇటువంటి ప్రసంగములే, ఇవి

జరగటానికి ముందు దానిని గురించి ఎవ్వరూ కల్పన కూడా చేయలేకపోయారు.

**యుగసంధికాలములో, శ్రేష్ఠమానవీయ విలువల స్థాపన మరియు అవాంఛనీయతలను నివారించటానికి క్రాంతులు, రైలుబండి పెట్టెల వలె ఒకదానివెంట ఒకటి పరిగెత్తుకుంటూ వస్తున్నాయి.** అవి ద్రుతగతితో పట్టాలమీద పరిగెత్తడము కళ్ళున్న ప్రతీవాడికి ప్రత్యక్షముగా కనిపిస్తుంది. మనీషీల ప్రకారము ఉజ్జ్వల భవిష్యత్తు స్థాపన యొక్క ఈ మహా అభియానములో భారతదేశము అతి మహత్వపూర్ణపాత్ర వహించవలసి ఉన్నది.





# 1. విభీషికల అంధకారము నుండి తొంగి చూస్తున్న ప్రకాశకిరణములు

ఈ రోజులలో ఎటు చూసినా విపత్కర పరిస్థితుల గురించి చర్చ జరుగుతోంది. అనుమానాలను, విపత్తులను పెద్ద ఎత్తున ఊహించి చిలవలు పలవలు చేసి చెప్పడమనేది మానవ స్వభావము. నిజానికి వాస్తవముగా కూడా, మానవజాతి భవిష్యత్తు నిరాశామయముగానూ మరియు అంధకారబంధురంగానూ కనిపిస్తోంది. మనిషి వైజ్ఞానిక క్షేత్రంలోఅసాధారణ ప్రగతిని సాధించాడనేదానిలో ఏమీ సందేహము లేదు. 20 వశతాబ్దపు గత రెండు దశకాలలో ఎంత తీవ్ర గతిలో పరివర్తనలు వచ్చాయంటే ప్రపంచము యొక్క కాయకల్పము అయిపోయిందా అనిపిస్తుంది. సుఖసాధనాలు పెరిగాయి. వాటితో పాటు ఒత్తిడి, ఉద్విగ్నత, మానసిక సంక్షోభ, విక్షోభాలలో కూడా పెరుగుదల వచ్చింది. వ్యక్తి అంతరంగము అశాంతితో నిండివున్నది. భౌతిక సుఖాల మృగతృష్ణలలో అతను ఎంత దారితప్పిపోయాడంటే, అతనికి ఉచితానుచితాల, ఉపయోగానుపయోగాల జ్ఞానము లేకుండా పోయింది. ఆలోచించడానికి యోగ్యము కాని దానిని గురించి ఆలోచించడము మరియు చేయకూడని పనులు చేసుకుంటూ పోవడము జరుగుతున్నది. ఫలితముగా విపత్తుల కారుమేఘాలు అతనికి సవాల్‌గా మారి ముందు నిలబడ్డాయి.

ప్రతీవ్యక్తి తీవ్రవేగంతో జరుగుతున్న ఈ మార్పులు మరియు విశ్వమానవతయొక్క భవిష్యత్తును గురించి చింతిస్తున్నాడు. ప్రసిద్ధ

ఆలోచకుడు మరియు భవిష్యవిజ్ఞాని శ్రీ ఆల్విన్‌టాఫ్లర్ - ఫ్యూచర్‌షాక్_అనే తన పుస్తకంలో ఇలా వ్రాశారు - " ఇది ఒకవిధంగా మంచిదే! ఏమిటంటే మనిషి తప్పు చేశాడు. ప్రమాదాలను, విపత్తులను అతనే ఆహ్వానించాడు మరియు అతనే ఈ సమస్యలకు పరిష్కారం వెతకడం మొదలుపెట్టాడు".

'టైమ్' అనే ఒక ప్రసిద్ధ అంతరాష్ట్రీయ పత్రిక ప్రతీ సంవత్సరము ఒక విశిష్ట వ్యక్తిని " మ్యాన్ ఆఫ్ ది ఇయర్ " గా ఎన్నుకుంటుంది. 1988 వ సంవత్సరములో ఈ పత్రిక ఎవరినీ " మ్యాన్ ఆఫ్ ది ఇయర్" గా ఎన్నుకోకుండా పృథ్వినే " ప్లానెట్ ఆఫ్ ది ఇయర్ " గా ప్రకటించింది. ఈ ప్రకటన జనవరి 2 వ తారీకు 1989 న చేయబడింది. అందులో పృథ్విని "ఎన్‌డేంజర్డ్ ఎర్త్" అనగా ప్రదూషణ వలన కష్టాలవలయములో చిక్కుకున్నదిగా వర్ణించారు. ఈ విధముగా పృథ్విగురించి చెప్పడము వలన మనీషీల ఆలోచనల ప్రవాహాలు ఈ దిశగా వెళ్ళుచున్నవని తెలుస్తోంది. మనం సర్వవినాశనదిశవైపు వెళ్ళుతున్నామా? ఈ ప్రశ్న అందరి మనస్సుల్లోను మెరుపువలె మెరుస్తోంది. ప్రపంచములో ఆలోచించగలిగే వారందరు తమతమ స్థాయిని బట్టి పరిస్థితిని విశ్లేషించి భవిష్యత్తు గురించి తమ అభిప్రాయాన్ని తెలిపారు. వీరందరు - ఇంకా పరిస్థితులు చెయ్యి దాటిపోలేదని, మనిషి తన ఆలోచనా విధానాలకు సవ్యదిశ ఇవ్వగలిగితే రాబోయే విపత్తులనుండి తప్పించుకోగలడనీ చెప్తున్నారు.

ప్రపంచము అంతటినుండి వచ్చిన డేటాను విశ్లేషించి



భవిష్యత్తును ఊహించే హడ్‌సన్ ఇన్‌స్టిట్యూట్, న్యూయార్క్ కి సంబంధించిన హరమన్‌కాన్, వరల్డ్ వాచ్ ఇన్‌స్టిట్యూట్, అమెరికాకు చెందిన లెస్కర్ ఆర్ బ్రౌన్ లెక్కలు కట్టి భవిష్యత్తు యొక్క రూపురేఖలు అంచనా వేశారు. 400 సంవత్సరాల క్రిందట ఫ్రాన్స్‌లో జన్మించిన చికిత్సకుడు నోస్ట్రర్‌డామస్, ఫ్రాన్స్‌లో 'కీరో' గా ప్రసిద్ధిచెందిన నార్మన్ కుటుంబములో జన్మించిన కౌంట్‌లూయీ హెమన్, క్రిస్టల్‌బాల్ (స్పటికము) ఆధారముగా భవిష్యత్తును చెప్పే విఖ్యాతి గాంచిన మహిళ జీన్‌డిక్సన్, క్రాంతికారీ మనీషీ మహర్షి అరవిందుల లాంటి గొప్ప వారందరూ ఈ సమయము అత్యంత కష్టకాలముగా కనిపిస్తున్నా, సర్వనాశనము తప్పదని అనిపిస్తున్నా, చివరికి తప్పక సద్బుద్ధి దుర్బుద్ధిపై విజయము సాధిస్తుందని, పృథ్విపై మళ్ళీ సత్యయుగవాతావరణము ఏర్పడుతుంది అని నొక్కి చెప్తున్నారు. నేటి విపత్కర పరిస్థితుల గురించి పెరుగుతున్న అవగాహన వల్ల మనీషీలు విశేషముగా మంచి రోజులు వస్తాయనే ఆశను వ్యక్తము చేస్తున్నారు. యుగసంధికాలము అని పిలువబడే 20వ శతాబ్దము సమాప్తి యొక్క 12 సంవత్సరములు (1988-2000) మరియు 21వ శతాబ్ది ప్రారంభపు పన్నెండు సంవత్సరాలు (2000-2012) మనిషి తన పరాక్రమ - పురుషార్థాలను శ్రేష్ఠమైన దిశలో వినియోగించాలి. బ్రాహ్మీచేతన, దైవీ విధివ్యవస్థ, మహాకాలుని ప్రత్యావర్తన ప్రక్రియ మిగిలిన పనిని స్వయముగా చేయించుకుంటుంది.

ఈ రోజులలో పరిశ్రమల పొగగొట్టమునుండి వెలువడే ప్రదూషణము గాలిని, కార్ఖానాల నుండి వెలువడే చెత్త, మలినపదార్థాలు, జలాశయాలను, నదుల నీటిని పాడు చేస్తున్నాయి. పెరుగుతున్న జనసంఖ్య వల్ల ఇంధనములు కూడా చాలా ఎక్కువగా వాడబడుతున్నవి. ఈ విధంగా వాయుమండలంలో పెరుగుతున్న విషాలు మరియు అంతరిక్షంలో పెరుగుతున్న ఉష్ణోగ్రత వల్ల ఒకవైపు ఊపిరిసలపని పరిస్థితులు ఏర్పడు తుంటే, రెండవవైపు ధృవాల వద్ద మంచుకరిగి సముద్రమట్టము పెరుగుట వల్ల సముద్రపు ఒడ్డున ఉన్న అనేక పెద్ద నగరాలు మునిగిపోయే ప్రమాదము పొంచి ఉంది. అంతరిక్షము పై పొరలలో ఓజోన్‌పొర చిరగడం వల్ల, అయాన్‌మండలము పలుచబడటమువల్ల బ్రహ్మాండ కిరణములు, అల్ట్రా వైలెట్ కిరణములు (వయరస్‌లు) పృథ్వి మీద వర్షించవచ్చు అనే చర్చ ఈనాడు చాలా ఎక్కువగా వినిపిస్తోంది. యుద్ధాల వల్ల, అణుఆయుధాలు, రసాయనికబాంబుల వల్ల వాతావరణములోకి చేరుతున్న కాలుష్యము కూడా భయమును కలుగచేస్తున్నది. రష్యాలోని చెర్నోబిల్ రియాక్టర్ లీకేజీ వల్ల అణువికిరణములు ప్రజల ఆరోగ్యము మీద ఎంత హానికరమైన ప్రభావాన్ని చూపుతున్నాయో ప్రత్యక్షముగా చూశాము కదా!

నిరంతరము తరుగుతున్న వనసంపద వల్ల, పృథ్వీమీద 'ఆకుపచ్చపొర' తగ్గడము వల్ల మానవజాతికి రాబోయే ముప్పు అందరికీ తెలిసినదే. వర్షము తగ్గడం, భూమికోత జరగడం,



ఎడారులు పెరగడం, జలాశయాల మట్టం తగ్గడం, వంట చెఱకు లేమి, వాయువులో ఆక్సిజన్ తగ్గి, నదుల అడుగున ఎక్కువ పరిమాణములో మట్టి చేరడము వల్ల వరదల ముప్పు ఏర్పడడం, ఋతువుల అసంతులన వల్ల అతివృష్టి-వడగళ్ళ దెబ్బ మొదలగునవి అన్నీ మనిషి ఆలోచనారహితంగా, బాధ్యతారహితంగా తన వృక్షసంపదను నరుక్కోవడము వల్ల వచ్చే అనర్థాలు.

వేగముగా పెరుగుతున్న జనాభా అనేకవిధాలుగా లోటును కలుగచేస్తోంది. నగరాలలో మురికివాడలు పెరుగుతున్నాయి. చిన్న పట్టణాలు నగరాలుగా రూపొందుతున్నాయి. మురికి-చెత్త కూడా దీని వలన పెరుగుతున్నది. క్రీస్తుశకము ఆరంభము అయ్యేనాటికి ప్రపంచజనాభా మొత్తము ముప్ఫైకోట్లు. ఈనాడు పృథ్వి మీద దానికి సుమారు 17 రెట్లు అనగా 500 కోట్లమంది కంటే ఎక్కువ వ్యక్తులు ఉంటారు. సాధనములు తక్కువగా ఉన్నాయి. ఉపయోగించేవారు ఎక్కువగా ఉన్నారు. అందువల్ల ప్రగతి కార్యక్రమముల సఫలత సందిగ్ధంలో పడటమే కాక అరాజకత్వము ఏర్పడవచ్చు.

యువావస్థలో పెరుగుతున్న ఇష్టారాజ్యాలు, మరియు కామపరమైన స్వేచ్ఛ అనేక సుఖరోగాలకి, ఎయిడ్స్‌లాంటి నయము చేయలేని వ్యాధులకు కారణమౌతోంది. క్రమ క్రమముగా ఒక పెద్ద మానవ సమూహము ఈ వ్యాధులకు లోనవుతున్నది. ఈ విధముగా మహావినాశనమును బలపరిచే

పరిస్థితులు ఏర్పడుతున్నాయి. మత్తుపదార్థాల సేవన విపరీతంగా పెరుగుతున్నది. స్మాక్, హెరాయిన్, మ్యారీజువానా లాంటి ప్రమాదకరపదార్థాలు పెద్ద సంఖ్యలో యువతను మతిస్థిమితము లేనివారిగా మరియు నిరుద్యోగులుగానూ, విక్షుప్తులుగానూ మారుస్తున్నది. జీవనీశక్తి తగ్గుతూ వస్తున్నది. వాతావరణములో స్వల్పమార్పు మనిషిని రోగగ్రస్తుణ్ణి చేస్తోంది. వైద్యాలయాల సంఖ్య పెరుగుతున్నది మరియు ప్రత్యక్షరోగుల సంఖ్య, పరోక్షంగా మానసిక రోగుల సంఖ్య విపరీతముగా పెరుగుతున్నది.

విలాసమయ జీవితములో ఏమీ తగ్గుదల కనిపించుట లేదు. నిరుద్యోగ సమస్య, పెరుగుతున్న ఖర్చులు, పెరుగుతున్న జనాభాని ఇరువైపులా వాయిస్తున్నాయి. వివాహాలలో విచ్చలవిడిగా ఖర్చుపెట్టడము వల్ల సాధారణ స్థాయిలో ఉన్నవారు దరిద్రులు అవ్వటమే కాక, నిజాయితీని కోల్పోతున్నారు. అంతేకాక నవవధువులు వరకట్న పిశాచికి బలి అవుతున్నారు. వరకట్నమేకాక ఇంకా అనేక కురీతులు, మూఢవిశ్వాసాల వలన అనేక కుటుంబాలే కాక ధనము, సాధనసంపత్తి కూడా నాశనమగుట చూస్తున్నాము. కల్తీ-నకిలీ వస్తువులు పెరుగుతున్నాయి. అపరాధముల సంఖ్య, హింస, ఎంత వేగముగా పెరుగుతున్నాయంటే శాంతి, సువ్యవస్థల పరిస్థితి అదుపు తప్పుతున్నది. పరస్పర స్నేహ, సహయోగముల భావనలు ఎప్పుడో దూరమయ్యాయి. చివరికి వ్యక్తికి తమ వారిమీదే విశ్వాసము పోతోంది.

నేటి పరిస్థితులు భయంకరమైనవి అయినా వాస్తవికమైనవి.



ఈ సందర్భములో అంతర్రాష్ట్రీయస్థాయిలో నివారణోపాయముల గురించి మరియు విశ్వశాంతి గురించి ఆలోచించవలసివున్నది. ఎందుకంటే ఇది విశ్వమానవుడి మరియు సంపూర్ణ విశ్వము యొక్క సమస్య. సాహిత్యకారులు, కళాకారులు, మనీషీలు, ఆలోచనాపరులు ముందుకు రావాలి. కానీ ఈ విషమపరిస్థితులను ఎదుర్కొనుటకు, అవసరమైన విభూతుల వర్తమాన పురుషార్థము, అతి స్వల్పముగా కనిపిస్తున్నది.

నేటి పరిస్థితుల సమీక్షకులు, పర్యవేక్షణలను ప్రజల ముందు ఎలా పెడుతున్నారంటే వర్తమానము యొక్క అవాంఛనీయ పరిస్థితులు మరియు భవిష్యత్తుయొక్క అశుభ సంభావనలు అధికపరిమాణములో దృగ్గోచరమౌతున్నాయి. దీనివలన నిరాశాజనకమైన, నిషేధాత్మక వాతావరణము ఏర్పడుట సహజమే. నిరాశాపూర్ణ మానసికస్థితి స్వయముగా ఒక పెద్ద విపత్తు. అటువంటి వ్యక్తి సమర్థుడైనప్పటికీ ఉజ్జ్వలభవిష్యత్తు నిర్మాణము కొరకు ఏమీ చెయ్యలేని అసమర్థుడుగా తయారవుతాడు. ఉత్సాహము, ఉల్లాసములు తగ్గి మనోబలము కోల్పోతున్నాడు.

సాహసముతో కూడిన ఉత్సాహ మున్నప్పుడు, ప్రతికూల పరిస్థితులలో కూడా కొంతమంది వ్యక్తులు కలిసి మెలిసి అద్భుతమైన ఫలితాలను పొందగలరు. **పరాక్రమము మరియు భవిష్యత్తును కూడా మార్చి వేయగలిగే సామర్థ్యము మానవుడికి లభించిన అత్యుత్తమ విభూతి.** దీని మీద నమ్మకము ఉంచగలిగితే నేటి నిరాశాపూరిత వాతావరణములో కూడా ఆశామయ

ఉజ్జ్వలభవిష్య సంభావనలు ఏర్పడవచ్చును.

నిజానికి ఈ పరివర్తన ప్రక్రియ చాలారోజులనుండీ నడుస్తున్నది. కానీ దాని ఆరంభిక మందగతి తీవ్రవేగము పుంజుకోవటానికి తగిన వాతావరణము ఈ పన్నెండు సంవత్సరాలలో లభించినది అని 'మనీషీ' ల మరియు దివ్యదర్శనుల అభిప్రాయము. ఈ పన్నెండు సంవత్సరాలు 20వ శతాబ్దపు సమాప్తి మరియు 21వ శతాబ్దపు ఆరంభమునకు మధ్యకాలము అని చెప్పవచ్చు. ఈ అవధిలో పరస్పర విరోధ గతివిధులను చూస్తున్నాము. ఒకవైపు దుష్ప్రవృత్తుల కష్టము కలిగించే దండవ్యవస్థ తన పరాకాష్టను చూపిస్తున్నది. రెండవవైపు నూతన అభినవ సృజన యొక్క ఆధారాలు నిర్మించబడుతున్నాయి. ఇటువంటి పరిస్థితులలో మనస్సు ఏమీ నిశ్చయించుకోలేదు. దీనినే "యుగసంధి" అంటారు. ఒక విధమైన పరిస్థితులు ఏర్పడుతూంటాయి, మళ్ళీ అప్పుడే వేరొకరకమైన పరిస్థితులు వస్తూవుంటాయి. ఈ రెండు ప్రక్రియలు పరస్పరపూరకాలు. ఆకురాలు ఋతువుతో పాటు వసంతఋతువు యొక్క పచ్చదనము తన ఆగమనమును గురించిన సంకేతాలనిస్తుంది. అన్ని దిక్కులా ఉల్లాస ఉత్సాహ పూరిత వాతావరణము ఎర్పడుతుంది. కృశించి, జీర్ణమౌతున్న శరీరము వదులుతున్నప్పుడు జీవికి దుఃఖము వస్తుంది. కానీ ఇది జరగకుండా నూతన జన్మ యొక్క ఆనందము ఎలా లభిస్తుంది. శస్త్రచికిత్సకుడు నిర్దయుడై కురుపులను కోసేస్తాడు. కానీ



ఏకత్రితమైన రసి పిండివేసినప్పుడు కష్టనివృత్తి యొక్క ఆనందము కూడా వుంటుంది కదా!

**దూరదృష్టి కలవారు, భవిష్యద్రష్టలూ, ఆధ్యాత్మికవేత్తలు మరియు భవిష్యత్తును ఊహించటానికి సామర్థ్యముగల వైజ్ఞానికులకు ఈ రోజులలో నలువైపులా ఒక విస్తృతమైన పరివర్తనా తరంగము కనిపిస్తోంది. వీరందరూ నేటి పరిస్థితులు బాధను కల్గించేవిగా ఉన్నా త్వరలోనే ఉజ్జ్వలభవిష్యత్తుయొక్క నిర్మాణాత్మక ప్రవృత్తులు పెరుగుతూ ఉన్నాయి అనే దానిలో ఏకాభిప్రాయాన్ని కలిగివున్నారు.**

ఒకప్పుడు భవిష్యకథనము విజ్ఞానసమ్మతమైనదా? కాదా? అనేదానిమీద వివాదము వుండేదేమో? కానీ ఇప్పుడు స్వయముగా నృతత్త్వవేత్తలు (ఆంత్రోపాలజిస్టులు), భౌతికశాస్త్రవేత్తలు భవిష్యత్తు గురించి చాలా ముందుగానే అంచనావేయవచ్చును (ఎక్స్ట్రాపోలెష టెక్నిక్స్)అని ఒప్పుకుంటున్నారు. తదనుగుణ్యముగా మన క్రియాకలాపాలను సవరించుకోవచ్చును. చంద్రుని మీద మనిషి అడుగుపెట్టడానికి ప్రయత్నించే సంస్థలలో అగ్రగణ్యమైన అంతరిక్షసంస్థ "నాసా" కి సంబంధించిన ప్రసిద్ధ డా. ఎడ్గర్ మీచైల్ ప్రకారము భవిష్యకథనము నేడు వైజ్ఞానికముగా నిరూపించవచ్చని తెలియచేసారు. రాబోయేకాలము ఎలావుంటుంది అని చెప్పటము సంభవమే. సృజనాత్మకదిశలో ఆలోచిస్తూ ఆయన భవిష్యకాలము చాలా ఉజ్జ్వలముగా ఉంటుంది అని చెప్పారు. ఎందువలనంటే ఆధునికత పేరుతో పరిగెడుతూ నిరాశా, నిస్పృహలకు లోనౌతున్న మానవజాతి ఇప్పుడు

చాలా బాధ్యతతో చేస్తున్న కొన్ని పనులు నవయుగ అరుణోదయాన్ని సూచిస్తున్నాయి. ఒక ఇంటర్‌వ్యూ లో ఆయన 'The man who saw the future' (ద మాన్ హు సా ధ ఫ్యూచర్) అనే కృతిని గురించి మాట్లాడుతూ (దీని మీద ఒక వీడియో ఫిల్మ్ కూడా నిర్మించబడినది) ఇలా అన్నారు "What we contemplate today, becomes our future and it is going to be a dawn of a new era in coming few years, this can be foreseen by witnessing the events", అనగా మనమీనాడు ఏమి ఆలోచిస్తామో, ఏమి చేస్తామో అదే మన భవిష్యత్తు అవుతుంది. రానున్న సంవత్సరాలు నూతనయుగ అరుణోదయకాలము అన్నది సునిశ్చితము. ఇది నేటి సృజనాత్మక ప్రయత్నాలను చూచి చెప్పవచ్చును.

జ్యోతిష్కులు చెప్పే భవిష్యత్తు మీద ఎవరికైనా సందేహము ఉండవచ్చును. కానీ ప్రపంచములో అప్పుడప్పుడు అనేకమంది సూక్ష్మదర్శులు, అతీంద్రియ సామర్థ్యము ఉన్న భవిష్యద్రష్టలూ ఆవిర్భవించారు. వారు రానున్న కొన్ని సంవత్సరాల నుండీ శతాబ్దుల వరకూ ఏమి చెప్పారో అవన్నీ నిజమయ్యాయి. ఇటువంటివారు చెప్పిన భవిష్యత్కథనాలలో 21వ శతాబ్ది ఉజ్జ్వలభవిష్యత్తు కలదిగా చెప్పారు. వీరిలో వైజ్ఞానికులూ, చికిత్సకులు, గుహ్య శాస్త్ర వైజ్ఞానికులు మరియు రహస్య విజ్ఞానము తెలిసిన 'మనీషి' లూ మరియు ఆధ్యాత్మికవేత్తలు కూడా వున్నారు. వీరే కాక సామాన్య వ్యక్తులుకూడా అంతఃస్ఫురణ జాగృతమై, భవిష్యత్తు తెలుసుకొనే సామర్థ్యము వికసించి, భవిష్య గర్భములోకి తొంగిచూచి,



భవిష్యత్తును చెప్పగలిగారు. అవన్నీ కూడా నిజమైనాయి. అంతేకాక విశ్వస్థాయిలో ఉన్న కొన్ని సంస్థలు భవిష్యవిజ్ఞానము గురించి ఆలోచిస్తాయి. వీరు తథ్యములను, జరుగుతున్న సంఘటనలను, అనేక అలవాట్లను పరిశీలించి భవిష్యత్తును గురించి ఊహిస్తారు. వైజ్ఞానికక్షేత్రములో వీరి మాటలు ప్రామాణికముగా గుర్తిస్తారు. వీరందరూ మనిషి తన నడవడిక ఖచ్చితంగా మార్చుకుంటాడు అనే అభిప్రాయాన్ని తెలుపుతున్నారు.

శాంతికుంజ్, హరిద్వార్ కూడా దీన్ని గురించి చాలా లోతుగా ఆలోచించి, పరిశోధించి, ఈ నిర్ణయానికే వచ్చింది. విస్తృతమైన ఈ అధ్యయనము ద్వారా, పరిస్థితుల పరిశీలన మీద మాత్రమే కాక భవిష్యత్తు గురించిన అంతర్బోధ కూడా ఈ నిర్ణయానికి రావటములో పెద్ద పాత్ర వహించింది. ఎలాగైతే ఇతరులకు భవిష్యత్తుగురించి పూర్వాభాసమైనదో, ఖచ్చితముగా అదేవిధముగా భవిష్యత్తు ఉజ్జ్వలంగా ఉంటుందనీ, విపత్కర పరిస్థితుల మేఘాలు చెదిరిపోతాయనీ, త్వరలోనే నవయుగము యొక్క అరుణోదయము జరిగి తీరుతుందనే అంతఃస్ఫురణ ఈ సంస్థ సంచాలకుడు - సంస్థాపకుడికి కలిగింది. ప్రత్యక్షంగా 5 లక్షల పత్రికల ద్వారా, 25 లక్షల ప్రబుద్ధపాఠకుల ద్వారా మరియు పరోక్షంగా కోట్లమంది వ్యక్తులు ఈ మిషన్‌తో, సూత్రసంచాలకునితో జోడింపబడ్డారు. వీరందరికీ 21వ శతాబ్ది నూతన ఉజ్జ్వల సంభావనలను తీసుకువస్తున్నది అనే హామీ ఇవ్వబడుచున్నది.

దీనికి చేయవలసినది ఏమిటంటే ఈ స్వర్ణిమ ప్రభాతమును ఆహ్వానించడానికి ప్రపంచములో ఉన్న ఆశావాదీ

'మనీషిలు', ప్రతిభాసంపన్న సృజనశిల్పులు ఒకటై, ఇతరుల మనోబలాన్ని పెంచాలి. ఈ 12 సంవత్సరాలల్లో సంభవించే ప్రతికూలతలను తొలగించడానికి అన్ని ధర్మ, జాతి, మతముల వ్యక్తులకు ఒక సామూహిక మహాపురశ్చరణ, **సవితా ధ్యానము - సద్బుద్ధి ధారణగా** శాంతికుంజ్‌లో ప్రారంభించబడినది. ప్రతి ఒక్కరినీ దీనిలో పాలుపంచుకోవడానికి హృదయపూర్వకముగా ఆహ్వానిస్తున్నాము.

**పుణ్యము యొక్క పరిణామము సంపత్తి కాదు, సద్బుద్ధి.**
**పాపమునకు పరిణామము బీదరికము కాదు, దుర్బుద్ధి.**

## 2. మానవీయ దుర్బుద్ధినుండి మొలకెత్తిన నేటి సమస్యలు

కర్మచేయుటకు మనిషి స్వతంత్రుడే, కానీ ఫలితము పొందుటకు మాత్రము అతడు సృష్టి నియమాలలోనే బంధింపబడివుంటాడు. మిగిలిన జీవరాశులు ఈ తథ్యమును తమ స్వాభావిక ప్రేరణనుండి అర్థము చేసుకుని తదనురూపముగా ఆచరణలో పెడతాయి, కానీ మానవుడుమాత్రము త్వరత్వరగా ఫలితములు లభించుటలో ఆలస్యమైతే తప్పులు చేస్తూ వుంటాడు. ఇంగిత జ్ఞానమును దూర దృష్టిని విస్మరిస్తాడు. వివేకశీలతను ఉపేక్షించి పనులు చేయడంవలన రానున్నరోజుల్లో ఎటువంటి దుష్పరిణామములను ఎదుర్కొనవలసివస్తుంది అనే విషయము మర్చిపోతాడు. తప్పిద మేమిటంటే తెలిసి తప్పు చేస్తాడు, ఫలితముగా కష్టములు, సమస్యలు, విపత్తులను ఎదుర్కొనుటకు అంతకంటే ఎక్కువ కష్టపడవల్సివస్తుంది. ఒక సమయములో మానవుడు తన గరిమను అనుభూతిలో వుంచుకుని, తాను స్రష్టయొక్క యువరాజును అనే గొప్పదనమును అనుభవములోకి తెచ్చుకుంటూ తన చింతనను, కర్తృత్వమును, ఎటువంటి ప్రతికూలతలను ఎదుర్కొనవలసిన అవసరము లేకుండా, సువ్యవస్థ ఏర్పడే విధంగా తీర్చిదిద్దుకున్నాడు.



ఈ ప్రపంచములో ఎన్ని సాధనాలు వున్నాయి అంటే వాటిని సరైన రీతిలో పంచుకుని వుపయోగించుకుంటే ఎవరికీ ఎటువంటి సంకటపరిస్థితులు ఎదురవ్వవు. ప్రాచీనకాలములో అందరికీ ఇటువంటి సద్బుద్ధియే వుండేది. ప్రతివారూ అడుగు ముందుకువేసేముందే ఈరోజు, రేపు తర్వాత దీని పరిణామము ఎలా వుంటుంది? అని ఆలోచించేవారు. ఉచితానుచిత విచక్షణతో సత్ఫలితమును పొందే పూర్వపురోజులనే మనము సత్యయుగము అని చెప్పుకుంటాము. సన్మార్గమనే రాజమార్గమును వదిలివేసి తొందరపాటుగల వ్యక్తులు పెద్ద అడుగులువేస్తూ ముళ్ళబాటలోకి అడుగుతారు. మధ్యలో పరస్పర విరోధీ స్వార్థములు ఢీకొని ఇంకా అనేక సమస్యలు తలెత్తేలా

చేస్తుంది.

సుదూర పరిణామములను ఆలోచించకుండా ఎవరైతే తాత్కాలిక లాభమునే సమస్తం అనుకుంటారో, వారు పావురాళ్ళు, చేపలు వలె వలలో చిక్కుకుంటారు. మరియు పంచదారపాకములో కళ్ళుముసుకుని పడిపోయి ఇరుక్కుపోయిన ఈగలవలె మృత్యువుపాలవుతారు. దుర్బుద్ధి అనే ఈ కుచక్రము ఎప్పుడు అసాధారణగతితో తీవ్రమవుతుందో, అప్పుడు సమస్యలు ఎదురవుతాయి, అవి మానవులను విపత్తులు అనే ఊబిలో నుండి పైకి లేవనివ్వవు.

క్రియకు ప్రతిక్రియ జరగటానికి ఒక్కొక్కసారి చాలా సమయము పడుతుంది. అందువలన చాలామంది చేసినదానికి అనురూపముగా ఫలితము లభించడము అనేది ఆవశ్యకముకాదు అని అనుకుంటారు. చాలాసార్లు తప్పుడు పనులు చేసేవారుకూడా ఆ పాపదండన నుండి తప్పించుకుంటారు, చాలాసార్లు మంచి కర్మలుచేసినా కూడా సత్ఫలితములు ఎక్కడా కనిపించవు. దీనితో ఏమనుకుంటారు? సృష్టిలో నియమిత కర్మఫలవ్యవస్థ లేదు. చీకటి రాజ్యమే కొనసాగుతోంది అనుకుంటారు. ఇటువంటి స్థితిలో స్వేచ్ఛాచారులు ఇష్టమొచ్చినట్లు వ్యవహరిస్తూ, ప్రతిక్రియ ఉత్పన్నమయ్యే సమయమువరకు ఎదురుచూడక, నాస్తికుల వలె అవిశ్వాసముతోనే ఏదితోస్తే అది చేస్తూ వుంటారు. ఒక విషయము మాత్రము మర్చిపోతారు. బీజము వృక్షముగా మారితీరుతుంది, కానీ దానికి సమయము పడుతుంది. పాలు, పెరుగుగా



మారటానికి కొంత సమయము పడుతుంది. సంయమనము కోల్పోయేవారు తమ అనాచారములకు తగిన దండన అనుభవిస్తారు, కానీ దానికీ సమయము పడుతుంది. పొగత్రాగేవాడి ఆరోగ్యము పాడవుతుంది. జీవించేకాలము తగ్గిపోతుంది. కానీ ఇదంతా వెంటనే కనిపించదు.

ఒకవేళ అబద్ధము చెప్పగానే నోటిలో నంజుపొక్కులు, దొంగతనము చేయగానే చేతికి పక్షవాతము, వ్యభిచరించగానే నపుంసకులైతే అప్పుడు తప్పులు చేసే సాహసము ఎవరికీఉండదు. కానీ భగవంతుడు మనిషికి ఉచితము, అనుచితము మధ్య నిర్ణయము తీసుకునే సామర్థ్యము పెంచుకుని తన వివేకాన్ని, బుద్ధిని వృద్ధిచేసుకుని జాగృతము చేసుకోవటానికి సమయమిస్తున్నాడేమో! వివేకమును సవ్యముగా వుపయోగించుకుని ఉచితమైన, సవ్యమైన మార్గములో నడవాలి. ఈ పరీక్షలో ఉత్తీర్ణులు కానివారికి దండన లభిస్తుంది కానీ ఆలశ్యముగా లభిస్తుంది. ఇటువంటి పరిస్థితులలో వారు పశ్చాత్తాపము పడుటయేకాక దూరదృష్టి లేకపోవడము అలవాటుగా మారి అడుగడుగునా తప్పులు చేస్తూ ఎదురు దెబ్బలు తింటూ దుర్గతిపాలవుతారు. దీనికి విరుద్ధంగా, ఆలోచించి పరిణామాలను ధ్యాసలో వుంచుకుంటూ, తన వర్తమాన గతివిధానాలను సునియోజితము చేసేవారు తమ జీవనసంపదను సదుపయోగము చేసుకుంటూ స్వయముగా ధన్యులవడమేకాక, తమని అనుకరించుటకు వీలుకలగజేసి అనేకులకు మేలుచేస్తారు. మనిషికి

**ఈశ్వరుడు అనేకానేక విశేషతలు, విభూతులు ఇచ్చాడు. అందులో ఒకటి ఏమిటంటే క్రియయొక్క ప్రతిక్రియను ఊహించుకుని, అనిష్టములనుండి తప్పించుకుంటూ సుఖశాంతిమయ జీవితము పొందడము.**

ఈరోజులలో స్నేహ-సద్భావములు, సహకార-సదాచారముల లేమివలన మనిషి వ్యవహారము ఎంత విచిత్రంగా తయారైందంటే దానిలో శోషణ ప్రధానంగా కనిపిస్తోంది. సహయోగమువలన పరస్పరము ఒకరికొకరు మేలు చేసుకునే ప్రక్రియ జరుగగలదు, కానీ ఎక్కడైతే వ్యక్తివాదమే ఏకైక లక్ష్యముగా ప్రాముఖ్యతను సంతరించుకుంటుందో మరియు సంకీర్ణస్వార్థపరత జీవిత లక్ష్యమవుతుందో అప్పుడు ఇతరుల అధికారమునకు హాని జరుగుతుందేమో చూసుకోము. ఇది ఎటువంటి స్థితి అంటే ఇందులో ఇతరుల కష్టములు, సంకటములు, అహితములవైపు ధ్యాస పెట్టము, కేవలము మన లాభమే చూసుకుంటాము. అనాచారము, అత్యాచారము, శోషణ, అపహరణ, ఉత్పీడనలయొక్క మూలములో ఇదే వృత్తి పనిచేస్తూవుంటుంది. నీచమైన పనులను నిస్సంకోచముగా చేయువారిలో ఇతరులపట్ల సహానుభూతి వుండదు. తమకు లభించే ఏ కొద్ది లాభముకొరకైనాసరే వారు ఇతరులపై పర్వతమంత సంకటములను పడవేయగలరు. ఇటువంటి అనర్థ మూలకమైన ప్రవృత్తిని, మానవధర్మ ప్రతిపాదకులు నిందిస్తూ ఇలా చెప్పారు. ‘ **ఆత్మవత్సర్వభూతేషు** ’ లాంటి భావసంవేదనలనే నిరంతరము



వుంచుకోవాలి. ఏ వ్యవహారములో మనకు ఏది నచ్చదో, అది ఇతరులపట్ల చేయరాదు. అందరిలోనూ నీ ఆత్మను చూసుకో అంటే ఇతరుల దుఃఖమును మన దుఃఖముగా, ఇతరుల సుఖమును మన సుఖముగా అనుకోవాలి. మానవీయస్థాయిలో భావసంవేదన ఉద్గమస్థానము ఈ మాన్యతతోనే కలసివున్నది. దీనిని కనుక హృదయంగమము చేసుకోగలిగితే అనాచారమును సహించుట సంభవము కాదు. సేవ-సహాయము చేయాలని మనసుకు అనిపిస్తుంది. దుఃఖమును-సుఖమును పంచుకునే ఉదారత నిలిచివుంటుంది.

నాది అనే ముడుచుకునే స్వభావము క్షుద్రమైనది, దానిని విస్తృతపరచుకుంటే అదే మహానత. మహామానవులు పుణ్య పరమార్థముల గురించి ఆలోచిస్తారు, ప్రణాళికలు వేస్తారు. గతివిధానాలను ఏర్పాటు చేస్తారు, ఇదే ఆత్మవికాసము. వికసించిన వ్యక్తికి ‘నాది’ అనే మమకారము మానవులపైన, ప్రాణులపైన కూడా ప్రసరిస్తూవుంటుంది. అటువంటప్పుడు తనకొరకు సుఖసాధనాలను సమకూర్చుకోవాలనే కోరిక ఎలా కలుగుతుంది? ఇంకా ఏమనిపిస్తుంది? ఇతరులు సుఖంగావుంటే చూసి మనసు ఆనందంగాను, ఇతరుల దుఃఖమును పంచుకోవాలని, సేవ-సహాయము చేయుటకొరకు పరిగెత్తాలనే ఆతృత వుంటుంది. అందరూ ఈవిధమైన మానవీయ మర్యాదలను పాటిస్తే ఎవరికైనా అనీతివైపు మొగ్గుచూపాలనే ఊహకూడ రాదు.

అన్నిరకాల ఆచరణలకు మూలకారణము, అదూరదర్శిత,

అవివేకము. ఏ పనికి భవిష్యత్తులో ఏ పరిణామము సంభవిస్తుంది? ఇటువంటి దూరదృష్టి లేకపోవుటచేత దానిలో అవినీతి వున్నాసరే తాత్కాలిక లాభమే అంతా అనిపిస్తుంది. దృష్టిదోషము వున్నవారికి ఏవిధంగా దగ్గర వస్తువులు మాత్రమే కనిపిస్తాయో, దూరముగా వున్న వస్తువుని గుర్తుపట్టడము కష్టమవుతుందో, అదేవిధంగా దూరదృష్టి లేనివారు త్వరితముగా వచ్చే లాభమే సర్వము అని అనుకుని ఎటువంటి పరిస్థితులలోనైనా దానిని పూర్తిచేయుటలో నిమగ్నులౌతారు. దానితర్వాతి పరిణామము ఏమవుతుంది? దీనిని దూరదృష్టి లేనివారు కనీసము గ్రహించలేరుకూడా. దృష్టి వున్నప్పటికీ అంధుల వంటి స్థితిలో వుంటారు. వారి స్వభావము ఎలా తయారవుతుందంటే అప్పటికప్పుడు తాత్కాలిక లాభము పొందుతారు కానీ తమ ప్రామాణికతను పోగొట్టుకుంటారు. అందరి దృష్టిలోను అవిశ్వసనీయ వ్యక్తులుగా మిగిలిపోతారు. వారికి నిజమైన స్నేహితులు వుండరు. వారిని పరామర్శించుటకు కానీ, వారిచే పరామర్శింపబడుటకుగాని యోగ్యులుగా భావించరు. శంకాపూరిత దృష్టితో చూస్తూవుంటారు. నిజమైన సహాయములేక, అవిశ్వసనీయ వాతావరణములో వారు సమూహములో వుండి కూడా ఒంటరితనాన్ని అనుభవిస్తారు. ఏకాకి జీవితము ఎంత నిస్సత్తువుగా, ఎంత నిస్తబ్ధతగా, భయంకరముగా వుంటుందో అది అనుభవించిన వారికి మాత్రమే తెలుస్తుంది. అవివేకము కారణముగా స్వభావములో అనేకానేక అవాంఛనీయతలు



సమ్మిళితము అవుతాయి, దుర్వ్యసనములు అలవాటు అవుతాయి. బద్ధకము, నిర్లక్ష్యము, మోసము-బూటకము, అతివాదము, అహంకారము, లిప్స-తృష్ణ వంటి అనేక అనౌచిత్యములు పిలువకుండానే తోడువస్తాయి. ప్రామాణికత కోల్పోవుటచేత ప్రఖరత, ప్రతిభ వ్యక్తిత్వమునుండి దూరమౌతాయి. చోరులు-టక్కరుల మనసు సదా భయముతోనే నిండి వుంటుంది, ఎక్కడ ఏ ప్రమాదము పొంచి ఉందో అనే అనుమానములు మరియు సందేహములు మొదలై ఆ సందేహాస్పద స్థితిలోనే సమయము గడచిపోతువుంటుంది. దానియొక్క ప్రతిఫలము పగ, అసహ్యము, తిరస్కారముల రూపములో తిరిగివస్తాయి. ప్రపంచమనే దర్పణములో తమ కురూప ప్రతిబింబము కనబడుతూవుంటుంది.

ఎవరినైనా కొంతకాలము వరకే మూర్ఖులను చేయగలము, కానీ అందరినీ అన్నివేళలలోనూ మోసము చేయుట అసంభవము. మనద్వారా చేయబడిన దుర్వ్యవహారము ఎవరో అన్యులద్వారా మనపై ప్రతిక్రియ రూపములో విరుచుకుపడుతుంది. ఎవరైనా ఎదుటివారిని మోసము చేస్తే అతను ఇతరుల ద్వారా మోసపోవలసి వస్తుంది. ఇటువంటి సంఘటనలను నిత్యం చూసస్తానే ఉంటాము. అసంయమపరులకు అప్పటికప్పుడు కాకపోయినా, తేపుటెల్లుండిలలో దుఃఖదాయకమైన ప్రతిక్రియ ద్వారా దండింపబడకుండా వుండలేరు.

మనిషికి, మనిషికి మధ్య జరుగుతున్న దుర్వ్యవహారముల

పరిణతి ఈరోజులలో అన్నిచోట్ల కొలిక్కి వస్తోంది. విశ్వాసమే లేనప్పుడు సహకారము ఏ ఆధారంగా లభిస్తుంది? సన్నగిల్లిన మనోబలము గల్గిన వ్యక్తి, ఉచ్చస్తరీయ సాహసమును ఎలా ప్రదర్శించగలడు? అతను ఎదగటానికి, ముందుకు పోవటానికి కావల్సిన సుయోగము ఎలా లభిస్తుంది?

మనిషికి-మనిషికీ మధ్య కమ్ముకున్న మోసము, అవిశ్వాసము, అనహాయోగము, అనాచారము, చిత్రవిచిత్రములైన వుద్వేగములు, అసంతోషములు మరియు దుర్వ్యవహారములను వుత్పన్నము చేస్తూ కనబడతాయి. ఫలితముగా ధనవంతులు-నిర్ధనులు, శిక్షితులు-అశిక్షితులు అందరూ తమతమ పరిసరాలలో కఠినపరిస్థితులు ఎదుర్కొంటూ భాధపడుతున్నారు. లోకులలో చాలామంది భూతప్రేతముల వలె మండుతూ మండించుకుంటూ, భయపడుతూ-భయపెడుతూ, ఉద్విగ్నులై, అసంతృప్తస్థితిలో కనబడుతూవుంటారు. సుఖసాధనాలు విరివిగావున్నా కూడా ఏమి లాభము? బయటవారికి సుఖ-సంపన్నులుగా కనిపించడము వేరే విషయము. వీరు ఎన్నో సాధనములతో సంపన్నులుగా వుండవచ్చు, కానీ తమ దృష్టిలో తామే దిగజారినస్థితిలో వుంటారు కనుక, అసంఖ్యాక సమస్యలు, చింతలు వారిని చుట్టుముట్టి ఉంటాయి.

నేడు ఇటువంటి స్థితిలోనే జనసామాన్యము ఇరుక్కునిపోయి వున్నది. ప్రగతిపేరుమీద సౌకర్యములు, సాధనములు అభివృద్ధిచెందివుండికూడా, చింతన, చరిత్ర మరియు



వ్యవహారములలో నికృష్టత నిండిన కారణముగా ఈనాటివారి పరిస్థితి ఎలావుందంటే లేమితో, అశిక్షితులుగా మరియు వెనుకబడినవారుగా గుర్తింపబడినవారితో పోలిస్తే ఇంకా ఎక్కువ హేయమైన స్థితిలో ఉన్నారు. దీనిని ప్రగతి అనుకున్నా కానీ వాస్తవానికి ఇది అధోగతియే.

**సుఖమును, ఆనందమును బయట వెదుకుతారు.**
**కానీ అవి లోపలే వున్నాయి. ఎవరు శాంతికొరకై వెతుకుతారో వారు**
**తమ దృష్టిని లోనికి త్రిప్పుకోవాలి.**

## 3. నిరాశను ఎట్టి పరిస్థితిలోను ఉండరాదు

అనాచారమును అనుసరించుటచేత ప్రత్యక్షవ్యవస్థలో అవరోధములు ఎదురవుతాయి, దానితోపాటే నియతిక్రమమును నిరంతరము వుల్లంఘించుటచేత ప్రకృతియొక్క అదృశ్య వాతావరణము ఈ రోజులలో చాలా ఎక్కువగా దూషితమవుతున్నది. భూకంపములు, తూఫానులు, వరదలు, అతివృష్టి, అనావృష్టి, కలహములు, విద్రోహములు, యుద్ధము, అపరాధములు, భయావహమైన రోగములు, మహమ్మారులు (అంటు వ్యాధులు) ఎంత వేగంగా పెరుగుతున్నాయంటే వీటిపై నియంత్రణ ఎలా సాధించాలి అనేదికూడా అర్థము

కావడములేదు. కింకర్తవ్య-విమూఢస్థితికి చేరుకున్న హతాశుడైన వ్యక్తి క్రమక్రమముగా అత్యంత నిరాశకు లోనౌవుతాడు. విశేషముగా ప్రగతిపేరుమీద విభిన్న క్షేత్రములలో చేసిన ప్రయాస వృథా అయితే, మహత్వపూర్ణ మార్పు వస్తుంది అనే భావనపైనే విశ్వాసము సన్నగిల్లుతున్నది.

భయంకరమైన హోరుగాలి, తూఫానుల మధ్య ఆశ అనే దీపము వెలిగించే సాహసము అతి కొద్ది మందికే ఉంటుంది. సృజన ప్రయోజనముల కొరకు తోటివారి సహయోగము లభించక పోయినా, మంచి ప్రయోజనములు, బాగుచేసే ప్రయత్నాలను ఏకాకిగా సాహసమును కూడగట్టుకొని, తిరగబడిన దానిని మళ్ళీ సరిచేసే ప్రణాళిక వేసుకుని, లక్ష్యముపట్ల అచంచలముగా ఉండి, గతిశీలతలో ఎక్కడా లోపము రాకుండా చేసుకొనే వ్యక్తులనే మహామానవులు-దేవదూతలు అని అంటారు. కానీ వారు చాలా అరుదుగా కనిపిస్తారు. వారి సంఖ్య ఎంత తక్కువగా వున్నదంటే వ్యాపించియున్న నిరాశను పారద్రోలుటకు ఆ ప్రతిభలనుండి ఎంత యోగదానము లభించగలదో అంత లభించుటలేదు. ఈనాటి జనసామాన్యము యొక్క మనస్సు ఇటువంటి ఊబిలోనే కూరుకునివున్నది. జరుగవల్సినది ఏమిటంటే అనౌచిత్యానికి బదులు, ఔచిత్యము ప్రతిష్ఠించడానికి కావలసిన సాహసము పురుషార్థము మేల్కొనుట. కాని ప్రజలు మనోబలము ఎంత దిగజారి పోయిందంటే ఆ స్థాయిలో ఉచ్చస్తరీయ ఉత్సాహము కలుగుటలేదు. అవాంఛనీయతలను తలక్రిందులుచేసే ఏసు, బుద్ధుడు, గాంధీ, లెనిన్ వంటి ప్రతిభలు రావడం లేదు.



ఈ పరిస్థితులలో సాధారణజనమానసము నిరాశాగ్రస్తమగుట స్వాభావికమే. ఇక్కడ మనము ఒకటి అర్థము చేసుకోవాలి. నిరాశ ఒక చిన్నస్థాయి రోగము కాదు, అది ఎక్కడ అంకురిస్తుందో అక్కడ పురుగు బలమైన దూలమును తొలిచి గుల్లచేసినట్లే చేసేస్తుంటుంది. నిరాశ తనతో ఎప్పుడూ ఓటమిని తోడుగా తెచ్చుకుంటుంది. విసుగు, అలసటలను కూడా కలుపుకుంటుంది. ఇన్ని ఒత్తిడిలు వల్ల మనిషి స్వయముగా దిగజారిపోవడమేకాక తోటివారిని కూడ క్రిందకి లాగుతారు. దీనితో శక్తి అపహరించుకుపోతుంది, జీవనీశక్తి నశించిపోతుంది. బిగింపు పెరిగేకొద్దీ ఉద్విగ్నత పెరుగుతుంది మరియు ప్రవాహములో కొట్టుకుపోతున్న నావను ఎటువంటి రచనాత్మక ఉపాయములతో ఒడ్డుకు చేర్చాలో తోచదు. నిరాశతో నిండిన వ్యక్తి ఎలా గెలవాలో తెలీక గెలవగలిగే పరిస్థితులలో కూడా ఓడిపోతాడు. నిరాశ, పడిపోయినవాడిని అటుపైకి లేవనివ్వదు, ఇటు క్రియాన్విత ప్రణాళికలవైపు సాగనివ్వదు.

అందువల్ల నిరాశను చిన్న విషయంగా భావించకుండా దానిని ప్రతీక్షేత్రములో అడ్డుకునే ప్రయత్నము చేయవలసిన అవసరమున్నది. అప్పుడే అందరికీ అన్నివిధాలా మేలు జరుగుతుంది. ఉత్సాహము, సాహసము జీవించి ఉంటేనే ప్రగతి ప్రయోజనముల కొరకు కార్యాన్వితులవడము సంభవమవుతుంది.

ఉజ్జ్వల భవిష్యత్తు యొక్క సంరచనను ధ్యాసలో వుంచుకుంటూ ఎక్కడ నిరాశాపూరిత వాతావరణము వుంటుందో, దానిని అక్కడే నిరోధించే ఉపాయములు ప్రయోగిస్తూవుండాలి. ఎక్కడైతే వుజ్జ్వలభవిష్యత్తును గురించిన ఆశావహ కల్పనలు ఆధారంగా చేసుకుంటావో అప్పుడే నిరాశయొక్క నిరాకరణ సంభవమవుతుంది.

కాలానుగుణ్యముగా రీతి-నీతులయందు అవాంఛనీయతలు ప్రబలుట చాలావరకు నిజమే. దానికి విరుగుడు ఏమిటంటే సమర్థచింతన మరియు పురుషార్థమును చేపట్టి వ్యక్తి-వ్యక్తినీ ఆలోచనా శక్తితో ఉత్తేజితులను చేయుటయే. ఉజ్జ్వలభవిష్య సంభావనలపై ధ్యాన ముంచడానికి మరియు దానిని సమర్థవంతంగా తయారుచేయడానికి ఉత్సాహపూరిత మనోవృత్తిని ఆశ్రయించాలి. దానికొరకు ఆవశ్యకమైన పృష్ఠభూమిని తయారు చేసుకోవాలి. దీనికి సంబంధించి వ్యక్తి-వ్యక్తికి విశ్వాసము కలుగజేయడానికి ఒక సమర్థ మరియు వ్యాపక ప్రయ్నుతమును సముచిత రీతిలో విస్తరింపజెయ్యాలి.

విభిన్న కాలాలలో ఇటువంటి పరిస్థితులలో మూర్ధన్యులైనవారి ద్వారా జనమానసముపై ఆవరించిన నిరాశాపూరిత ఆవరణ తొలగించుటకు పాంచజన్య శంఖారావము పూరించడం వంటి ప్రయత్నాలు సుసంపన్నము చేయబడ్డాయి. నిరాశను ఆశగా, వుపేక్షను పురుషార్థముగా మార్చుటకు, నూతన ఆధారాలను తీసుకొని సృజనాత్మక సాహసమును ఉత్తేజపరచడము యుగమనీషిల పని. విచారశీలుడైన ప్రతివ్యక్తి



దీనికి సహయోగమును ఇవ్వాలి.

ఇటువంటి అనేకానేక ప్రకరణలు చరిత్ర నిండా వున్నాయి. హనుమంతుని నేతృత్వములో ఎలుగుబంటి-వానరముల సముదాయము సముద్రమునకు సేతువును నిర్మించింది. లంకాదహనము గావించి విజయముయొక్క విశ్వాసముతో ఎలా దూకారంటే దుర్దాంతదానవులను ఆశ్చర్యచకితులను చేసి వారిని పరాజయముపాలుచేశారు. గోవర్ధనపర్వతమును ఎత్తగలిగే విశ్వాసము మనసుయొక్క లోతులలో నుండి కూడదీసుకున్న తరువాతనే గోపబాలురు కృష్ణుని అసంభవము అనిపించే ప్రయత్నాన్ని పూర్తి చేయుటకు సన్నధులయ్యారు . ఒక్క వ్రేలు యొక్క సంకేతముపై గోపబాలకుల చేతికఱ్ఱల సహాయముతో ఎత్తబడిన గోవర్ధనపర్వతోద్ధాన కథ ఈనాటికీ ప్రతీవారికి ప్రేరణనిస్తుంది. దీనికి విశ్వసించబడే ఐతిహాసిక సంఘటన రూపములో గౌరవము లభించింది.

ఫ్రాన్సకి చెందిన 'జోన్ ఆఫ్ ఆర్క్' అనే ఒక చిన్న బాలిక ఆ మొత్తము దేశముయొక్క స్వాతంత్ర్యము కొరకు ఎటువంటి జ్యోతిని ప్రజ్వలింపజేసిందంటే, అణచివేయబడిన జనసామాన్యము ఉన్మత్తులై లేచి పరాధీనశృంఖలాలను తెంచుకుంది. లెనిన్, రూస్‌కు చెందిన జనమానసములలో తనదైన శైలిలో ఉల్లాసముతో కూడిన ప్రాణములను నింపాడు. అందులో సఫలత పట్ల పరిపూర్ణ విశ్వాసము లోతుగా పాతుకుంది. దీని ఆధారముగానే మిగిలిన క్రాంతు లన్నీ సఫలమైనాయి.

బుద్ధుని యొక్క 'ధర్మచక్రప్రవర్తన' లో తత్కాలీన జనసముదాయమునకు ఉజ్జ్వలభవిష్యత్తు యొక్క ఒకే ఆధారము చెప్పబడింది. ఆయన చెప్పినది అర్థము చేసుకున్నవారు లక్షలసంఖ్యలో భిక్షువులుగా-భిక్షిణులుగా తమ జీవనదానము చేసి ఆయనతో నడిచారు. వారు కేవలము భారత-ఆసియాదేశాలే కాదు, మొత్తము ప్రపంచమంతా ఆరోజులలో వీస్తున్న గాలివాటమును త్రిప్పివేసి సరిచేయుటలో సఫలత పొందారు. గాంధీయొక్క సత్యాగ్రహము నిన్న-మొన్నటి ఘటన. ఆందోళనా సమయములో ఒక నిశ్చితవాతావరణము ఏర్పడింది. 'స్వాతంత్ర్యము మా జన్మసిద్ధ అధికారము, దానిని మేము తీసుకునితీరుతా' మనే విశ్వాస మాధారంగానే అసంఖ్యాకులు తుపాకీగుండ్లకు, కారాగారమునకు, సర్వనాశనమైపోవటానికి కూడా ముందుకు దూకి ఆహుతైపోయారు.

అర్జునుని మనస్సు నిరాశాపూరితమై ఉన్నది, అతను యుద్ధమును చేయకుండావుండేందుకు రకరకాల తర్కాలను ప్రయోగించాడు. అన్నీ విన్న తరువాత శ్రీకృష్ణుడు 'కౌరవులను నేను ముందే చంపేశాను, వారిప్పుడు చచ్చినవారే. నువ్వు నిమిత్తమాత్రుని భూమికను పోషించి విజయమును వరించు' అని ఒకేఒక రామబాణాన్ని ప్రయోగించాడు. అర్జునుడికి కృష్ణుని మాటలపై సంపూర్ణవిశ్వాస మున్నది. అన్ని చింతనలను ప్రక్కనపెట్టి మోహవిముక్తుడై వెంటనే యుద్ధరంగములో దిగిపోయాడు.



సంప్రదాయములను సృష్టించినవారు కూడ తమ ప్రతిపాదనలపై ముందు అనుయాయులకు విశ్వాసము కలిగిస్తారు. తరువాతనే అసంఖ్యాకుల అసాధారణ సహయోగము పొందుటలో సమర్థులయ్యారు. ఆధ్యాత్మిక మార్గములో మూర్ధన్యపురుషులు తమ పవిత్ర చరిత్ర, కష్టసాధ్యమైన తప-సాధనల అగ్నిపరీక్షలో ఉత్తీర్ణులయ్యాకే ఉచ్చస్థితికి చేరుకున్నారు. అటువంటి స్థితిలోనే వారి ప్రతిపాదనలు ఆప్తవచనముల వలె భావింపబడి శిరోధార్యమయినాయి.

ఈనాడు ఉన్న ధ్వంస ప్రవృత్తిని, సృజన ప్రవృత్తిగా మార్చడానికీ, అనౌచిత్యముపై ఔచిత్యమనే అంకుశమును ప్రయోగింపజేయుటకై ముందు ఇదే విధముగా జనమానసములను నిర్మించవలసి వుంటుంది. అది భయముతో, ఆటంకములతో, అశుభములతో మరియు వినాశముతో కూడిన మానసికస్థితిలో నుండి ప్రజాభిప్రాయమును పైకిలేపి ఆవశ్యక పరివర్తనలను చేయగలిగే శక్తిపై విశ్వాసమును కూడగడుతుంది. అంతేకాక భవిష్య సంభావనలకు సంబంధించిన అసమంజసమును వదిలి ఈ విశ్వాసమును పూర్తిగా హృదయంగమము చేసుకుని ఔచిత్యము, అనౌచిత్యముపై విజయమును సాధించ వలసిన సమయము ఇప్పుడు ఆసన్నమైనది. ఈ విశ్వాసమునకు ఆధారమైన తర్క, తథ్య, ప్రమాణ, ఉదాహరణల-శృంఖలలు వెతికి, వెతికి నియోగించబడుతున్నవి. దానికితోడుగా ఈశ్వరుని ఇచ్ఛ,

మహాకాలుని ప్రేరణ మరియు సునిశ్చిత సంభావనలను తెలియజెప్పే ఉచ్చస్తరీయ మాన్యతల గురించి అందరికి తెలియచెప్పాలి. అప్పుడు బంగారమునకు సుగంధము అబ్బిన సుయోగము ఏర్పడుతుంది.

ఈ సందర్భములో 21 వ శతాబ్ది సుఖముతో సమున్నతమవుతుంది అనేభావనకు సునిశ్చిత స్థానము లభిస్తే ఏ అవాంఛనీయతలు ఈరోజున చోటుచేసుకుంటున్నాయో దానికి విపరీతంగా సుఖదసంభావనల పుణ్య ప్రభాతోదయము కాబోతోందనే వార్త మానవుల మనస్సులలో ఒక దృఢ విశ్వాసముగా రూపు దిద్దుకుంటుంది. అందువల్ల లోకులు అనుచితమును వదలి ఉచితమును ఆచరించుటలో సాహసము చూపి, సమయము గడిచినకొద్దీ శ్రేయ-సంభావనలలో భాగస్వామ్యము వహించుటలో తమదైన అగ్రగామి భూమికను వహిస్తూ అనుకరణీయ ఆదర్శములను సిద్ధింపజేయుటకొరకు అధిక తత్పరతతోపాటు నడుము బిగించి గౌరవాన్వితులు అవుతారు.

**ఎప్పుడైతే మానవుని లోపల ఉచితము మరియు అనుచితము అనే అంతర్ద్వంద్వము లేచిందో సుఖశాంతులు చాలా దగ్గరలోనే వున్నాయని అర్థము చేసుకోవాలి.**



## 4. మన యుగపు అసాధారణ మహాక్రాంతి

**ప్రపంచ చరిత్రలో చిరకాలము స్మరించదగిన మరియు లోకమానసమునకు మహత్వపూర్ణ తథ్యములను అవగతము చేసిన ఎన్నో మహాక్రాంతులు జరిగినాయి. సమస్యలు ఏర్పడినచోట చిన్నచిన్న అవసరమైన మార్పులు కాలానుగుణ్యముగా జరుగుతూనేవుంటాయి. కాని ఎప్పుడైతే ఒక విశాల క్షేత్రములో పరివర్తనా ప్రవాహము జరుగుతుందో దాని పై విశ్లేషణలు, వివేచనలు కూడా జరుగుతాయి. ఇటువంటి సంఘటనలనే మహాక్రాంతులు అంటారు.**

పౌరాణికకాలములోని సముద్రమంథనము, వృత్రాసురవధ, గంగావతరణ, హిరణ్యాక్షుని బంధనాలనుండి పృథ్వియొక్క విమోచనము, పరశురామునిద్వారా కుపథగాములనుండి శక్తిని లాగివేయడము వంటి మహాసంఘటనలు ప్రముఖమైనవిగా చెప్పబడినాయి, కాలచక్రపరివర్తనలో ప్రధాన భూమికలను పోషించాయి. గ్రీస్, రోమ్, మెసపుటేనియా మొదలగు అన్యదేశముల సంస్కృతుల లోకకథలలోకూడ వీటికి దాదాపుగా సరిపోయే ఆలంకారిక వర్ణనలు వున్నాయి. బహుశా అవి అన్నీ సరైనవే అయితే మహాక్రాంతియొక్క శృంఖల చాలా పురాతనమైనదని ఒప్పుకునితీరాలి.

ఐతిహాసికకాలములోకూడా చాలా పెద్ద శక్తివంతమైన పరివర్తన జరిగింది. ఇందులో రామాయణ ప్రసంగము, మహాభారత ఆయోజనము మరియు బుద్ధుని ధర్మచక్రప్రవర్తన

ముఖ్యమైనవి. లంకాకాండ తరువాత రామరాజ్యముతోపాటు సత్యయుగము రావడము సంభవమైనది. మహాభారతకాలము తర్వాత విశాలభారతదేశమును 'మహాభారతముగా' తయారుచేసే లక్ష్యము పూర్తయ్యింది. బుద్ధునియొక్క ధర్మచక్రప్రవర్తనతో తత్కాలీన విచారక్రాంతి సంపన్నమైనది, దీనినుండి ఎగసిన నిప్పుఅవ్వలే అగణితక్షేత్రములను, అగణిత ప్రసంగములను ఊర్జ మరియు వెలుగుతో నింపివేశాయి. ఆ దావానలము అనేక సభా వేదికల, ధర్మసంప్రదాయముల, సాధువుల, సమాజసంస్కారకుల, వీరుల రూపములో గడచిన శతాబ్దులలో తన పరంపరను, ఉనికిని విభిన్న రూపములలో నిలుపుకున్నది. ప్రజాతంత్రము, సామ్యవాదముయొక్క సశక్తమైన క్రొత్త ఆలోచన ఈవిధంగానే ఎగసి, మొత్తము విశ్వవసుధను క్రాంతులతో నింపివేసింది. జరిగిపోయిన క్రాంతులయొక్క అనేక సందర్భముల ద్వారా మనకు ఏ సూచనలు లభిస్తాయంటే, 'మనీషా' ఎప్పుడు ఆదర్శవాదీ ఊర్జతో అనుప్రాణితమవుతుందో అప్పుడు అనేకమంది సహచరులను తనవైపుకు లాగుతుంది మరియు ఎటువంటి పని చేసి చూపిస్తుందంటే అది మానవజాతికి మ్రింగుడుపడక 'దైవీఅనుగ్రహము'వల్ల జరిగినదనిపిస్తుంది. పురాతనకాలములో ఇటువంటి ప్రభంజనములు, తుఫానులు అవతారముయొక్క సూచన అనుకుని సంతోషించేవారు. అసంభవమును సంభవము చేసి చూపించే మహాపరాక్రమములను మనీషాయొక్క ప్రఖరత జనసహయోగము, సహాయముతో సంపన్నము చేయగలదని



సామాన్యస్థాయి జనసముదాయము స్వీకరించదు కదా.

ఇదివరకటి మహాపరివర్తనలను యుగాంతరీయములు లేదా యుగపరివర్తనకారకములు అనికూడా చెప్పుకోవచ్చు. ఈరోజులు ఇటువంటి ప్రచండప్రవాహము మళ్ళీ అవతరించే సమయము, దీనిని జరిగిన సమస్తపరివర్తనల సంయుక్తశక్తియొక్క ఏకాత్మసమీకరణ అని చెప్పవచ్చు. ఇదివరకటి పరివర్తనలకు ఎంత సమయము పట్టింది? దీనికి సంబంధించి సరైన వివరణ లభించడం లేదు, కానీ వర్తమాన మహాక్రాంతియొక్క స్వరూపము సమగ్రరూపములో పరిలక్షితమగుటకు దాదాపు వంద సంవత్సరాల సమయము మహత్వపూర్ణమైనవి. దీని సూచనలు చాలా కాలము నుంచి దృష్టిగోచరము అవుతున్నా పూర్తిస్థాయిలో సిద్ధించినతర్వాత కూడా కొద్ది సమయము ఈ మార్పులు కొనసాగుతాయి.

మన సమయము యొక్క మహాపరివర్తనము 'యుగాంతర్' అనేపేరుతో తెలుపబడింది. యుగపరివర్తనయొక్క ప్రస్తుత ప్రక్రియలో రెండువేల సంవత్సరములనుండి జరుగుతూవస్తున్న ఆక్రమణలు-అనాచారములనుండి విముక్తి కొరకు జరిగిన జ్వలించేపక్షము అవగాహన చేసుకోవాలి. శక-హూణ-కోల-కిరాత-యవనులు నిరంతరము ఈ దేశముమీద ఆక్రమణలు చేస్తూనేవున్నారు. ఇక్కడ వైభవమును విపరీతముగా కొల్లగొట్టారు. ఈ విపత్తులు ఆక్రమణదారులను వెళ్లగొట్టేంత పరాక్రమమును మిగల్చలేదు, అయినప్పటికీ మహాక్రాంతి తన స్వరూపమును

ప్రకటించినది. రెండు ప్రపంచయుద్ధములు అహంకారుల నడుములు విరగ్గొట్టాయి, వినాశమునకు విరుచుకుపడే ఏ శక్తినీ దరిదాపుల వుండనివ్వలేదు. భారతదేశములో చాలాకాలంనుండి ఉన్న రాజనైతిక పరాధీనత యొక్క సంకెళ్ళు చూస్తూ-చూస్తూనే విడిపోయాయి. ఇంతటితో ఈ దావానలము ఆగలేదు. ఆఫ్రికామహాద్వీపంలోని అనేక దేశములు ఉపనివేశములు సాధారణ ప్రయత్నాల వల్లనే స్వతంత్రమైనాయి.అంతే కాకచిన్నచిన్న ద్వీపములు కూడా రాజనైతిక స్వతంత్రతను పొందాయి. ఈ విధంగా వలసవాదము సమాప్తమైపోయింది.

వీటి మధ్యలో వచ్చిన అనేక సామాజిక క్రాంతులు కూడా ఏదో ఒక క్షేత్రానికే పరిమితము కాలేదు సరికదా, సమస్త విశ్వమును ప్రభావితము చేశాయి. దాస-దాసీల ప్రథ, వారి క్రయ-విక్రయములు, లూటీలు-దొంగతనములు, అన్నీ ఆగిపోయాయి. ఇంత ప్రాచీన పద్ధతులు ఎంత వేగముగా నిర్మూలింపబడినా యంటే ఏదో ఒక పెద్ద తూఫాను బయల్దేరి అన్నింటిని తల్లక్రిందులు చేసిందా అనిపిస్తుంది. రాజతంత్రము ప్రపంచమంతా విస్తరించి ఉన్నది. సామంతవాదులు, రాజసభాసదులు, జమిందారులు, సంపన్నులు కూడా రాజ్యమేలేవారు. వారంతా తుఫానుగాలి తీవ్రతకు తెగిన గాలిపటాల వలె ఎటు కొట్టుకుపోయారో తెలియదు. స్త్రీలు, శూద్రులలో నాలుగింట మూడొంతులమంది తమ యజమానుల అనుగ్రహముపైనే ఆధారపడి ఏదోవిధముగా జీవితాలకు



అవసరమయ్యే సాధనాలు, అవికూడా వాళ్ళు దయతలచి ఇచ్చినవాటితోనే సర్దుకుంటూ ఏవిధమైన గౌరవము లేకుండా కాలం వెళ్ళబుచ్చారు. ఆ స్థితి ఇప్పుడు లేదు. ‘స్త్రీలు, పురుషులు సమానమే’, ‘జాతి-వంశము సమానమే’ అనే నిర్ధారణలను దాదాపు ప్రపంచములోని అధికశాతము సిద్ధాంతరూపములో స్వీకరించారు. అది లోక వ్యవహారములోకి రావడానికి ఇంకా కొంత సమయము పడుతుంది. సమస్యలు కూడా ఎదురౌవుతున్నాయి, తొందరలోనే ఈ సమస్యలు పరిష్కరింపబడతాయి. ఈ పరివర్తనలన్నీ ఈ 20 వ శతాబ్దములో జరిగినవి. కాని ఇవి నాటుకొని విస్తరించడానికి వేల సంవత్సరాలు పట్టింది.

ఆరిపోయే జ్యోతి ముందు ఒక్క సారిగా వెలుగుతుంది. రాత్రి చివరి భాగములో చీకటి ఎక్కువ గాఢముగా వుంటుంది. ఓడిపోయే జూదరి రెట్టింపు దుస్సాహసాన్ని చూపిస్తాడు. ‘ఎటూ చస్తాను, ఎందుకు చెయ్యకూడదు’ అనే సామెత ఇటువంటి సమయములోనే సరిగ్గా సరిపోతుంది. ఇప్పుడు అలానే జరుగుతోంది. నీతి, అనీతి మధ్య ఇప్పుడు భయంకర యుద్ధము జరుగుతోంది. హాహాకారములతో, ఆర్తనాదాలతో కూడిన వాతావరణము ఇప్పుడున్నది. అర్థంకాని ఈ పరిస్థితిలో మరి ఏమి జరుగుతోంది? కన్నుపొడుచుకున్నా కనిపించని ఈ అంధకారములో ఏమి జరుగుతోందో ఎవరికిమాత్రము తెలుస్తుంది? ఈ దాగుడుమూతలాటలో ఎవరు గెలుస్తున్నారు? ఎవరు

ఓడిపోతున్నారు? **అదృశ్యమును ఎవరైనా చూడగలిగితే వారికి ఆధారాలతోసహా సృజనయే గెలుస్తుంది అనే విశ్వాసము కలుగుతుంది.** సత్యమునకే విజయము లభిస్తుంది. ఉజ్జ్వల భవిష్యత్తు యొక్క సూర్యుడు ఉదయించి తీరుతాడు, కళ్ళను మోసం చేసే చీకటి సునిశ్చితముగా పారద్రోలబడుతుంది.

మహాక్రాంతియొక్క వర్తమాన పరిస్థితిలో ఏమి జరుగుతోంది? ఏమి జరుగబోతోంది? ఏమి తయారుచేయబడుతోంది? ఏది విచ్ఛినము అవుతోంది? దీనిని సరిగా అంచనావేయడము, చూడటము సాధారణ వ్యక్తులకు సంభవము కాదు. ఇద్దరు వస్తాదులు గోదాలో కొట్టుకుంటూ వుంటే ఎవరు ఓడిపోతున్నారు? ఎవరు గెలుస్తున్నారు? అనేది అర్థము కాదు. కానీ ఈ స్థితి ఎంతోసేపు వుండదు. వాస్తవము ముందుకొచ్చి తీరుతుంది. వర్తమానములో చెడు అధికముగా కనిపిస్తున్నది. సంస్కరించబడుతున్న గతి మందముగా కనిపిస్తున్నది. అయినప్పటికీ ప్రవాహముయొక్క గతిని చూస్తే మనము వెనుకబడుట లేదు, ముందుకు పోతున్నాము అని చెప్పవచ్చు. అనౌచిత్యముయొక్క సమాప్తి, ఔచిత్యము యొక్క అభివర్ధన అనేవి ఈ నిశ్చయముల సంక్షిప్త సారాంశము.

భవిష్యత్తు గురించి ఖచ్చితమైన నిర్ధారణ చేయలేము, ఎందుకంటే మనిషి తన భాగ్యమును తానే నిర్మించుకుంటాడు. అతడు దానిని బాగు చేసుకొనగలడు, చెడగొట్టుకోనుగలడు. మారుతున్న పరిస్థితులుకూడ అదృష్టమును తలక్రిందులు



చేయగలవు. ఐనా ఊహ, అంచనా సరైనదే అయితే సంఘటన జరుగక ముందే చాలా విషయములు ఊహించవచ్చు. దీని ఆధారంగానే ప్రపంచములో అనేక ప్రణాళికలు నిర్మించబడతాయి, గతివిధులు జరుగుతూవుంటాయి. భవిష్యత్తునుగురించిన ఊహ ఎప్పుడూ అనిశ్చితమే అయితే, ఏ మహత్వపూర్ణ విషయము గురించి ముందే ఆలోచించడము సంభవము కాదు.

ఇది మహాక్రాంతి సమయము, యుగపరివర్తన సమయము. అశుభమునుండి శుభము వైపుకు ప్రయాణము జరుగుతోంది, ప్రవాహము సాగుతోంది. తూఫానుయొక్క దిశను, వేగమును బట్టి వస్తువులు ఏ దిశలో తోయబడి ముందుకు విసిరి వేయబడతాయో వూహించవచ్చు. నదీప్రవాహములో పడిపోయిన ముళ్ళకంప, ప్రవాహము దిశవైపే పరిగెడుతుంది. తూఫాను ఏ దిశవైపు వుంటుందో అటువైపే ఎండుటాకులు, ధూళికణములు ఎగురుతూవుంటాయి. మహాక్రాంతి ఎల్లప్పుడూ సృజన మరియు సంతులనము కొరకు ఉద్భవిస్తుంది. పతనము, పరాభవముఅనే విడంబనలు కుసంస్కార వాతావరణములున్నరోజులలోనే జరుగుతాయి. చెట్టుమీదున్న పండు క్రిందివైపే పడుతుంది. నీరు పల్లమువైపు ప్రవహించి క్రిందివైపు వెళుతుంది. కానీ అసంతులనను సంతులనముగా మార్చడానికి మహాక్రాంతులు ఎప్పుడు వుద్భవిస్తాయో, అప్పుడు వాటి ప్రభావ పరిణామములు ఊర్ధ్వగమనముతో, ఔన్నత్యముతో, అభ్యుదయ రూపములో

వుంటాయి. అందుచేత వాటిని ఈశ్వరేచ్ఛ లేక భగవానుని అవతారము అనికూడా చెప్పవచ్చు. ఆ ఊపుని చూస్తుంటే ఉజ్జ్వల భవిష్యత్తుపై నమ్మకము కలుగుతుంది. మనమందరము శాంతి, ప్రగతి అనే లక్ష్యముల వైపు వెళుతున్నాము, వాటిని సాధించి తీరుతాముకూడా.

**చెప్పింది చెయ్యి, చేసేది చెప్పు.**
**రెండింటికి మధ్య తేడా రాకూడదు.**

## 5. చతుర్ధశక్తియొక్క అభినవ ఉద్భవము

మూడుశక్తుల ప్రభావము మరియు మహత్తు సర్వవిదితమే. 1. బుద్ధిబలము - ఇందులో విజ్ఞానము, సాహిత్యము మరియు కళ సమ్మిళితమై వుంటాయి. 2. శాసనశక్తి - దీనిలో అంతర్గతముగా వ్యవస్థ, సురక్ష మరియు తత్సంబంధమైన సాధనాలు మరియు అధికారము మొదలగునవి సమ్మిళితమై వుంటాయి. 3. ధనశక్తి - ఇందులో ఉద్యోగము, వ్యవసాయము, తనకొరకు సంపాదించుకొనుట మరియు బ్యాంకులు వుంటాయి. ఈ మూడింటి సహకారముతోనే చిన్న-పెద్ద, మంచి-చెడు అనేక పనులు సంపన్నమవుతాయి. ప్రగతి, అవగతిల లాభము కూడా ఈ మూడు శక్తులతోనే లభిస్తుంది. సరస్వతి, లక్ష్మి, కాళీల రూపములో వీటికే పూజ జరుగుతోంది. జనసాధారణముయొక్క



కోరిక-అభిలాషలుకూడ వీటిని పొందాలనే ఆతృతలోనే లగ్నమై వుంటాయి. వీటిలో ఎవరికి ఎంత భాగము లభిస్తుందో, వారు అంత గౌరవమును-కీర్తిని అనుభవిస్తారు. గొప్పదనమునకు ఈరోజులలో ఈ మూడు గీటురాళ్ళుగా వున్నాయి. వీటిననుసరించే కావలసిన సౌకర్యములు, సాధనాలు అన్నీ కొనుక్కోబడతాయి.

నవయుగ అవతరణకు ఇప్పుడు నాల్గవశక్తి వుదయించబోతోంది. దాని ఉనికి ప్రస్తుతము అక్కడక్కడ అరుదుగా కనిపించినా దాని వర్చస్సు ఎక్కడో ఎప్పుడో మాత్రమే కనిపిస్తుంది. దీని దుర్బలత లేక న్యూనత కారణముగానే అనేకానేక వికృతులు ఆవిర్భవిస్తాయి. అవి జలకుంభాల వలె జలాశయాలను ఆవరించుకొని వాతావరణమును అవాంఛనీయతలతో నింపి వేశాయి.

ఈ నాల్గవశక్తి పేరే 'ప్రఖరప్రతిభ'. సామాన్యప్రతిభ బుద్ధిమంతులు, క్రియాకుశలురు, వ్యవస్థాపకులు మరియు పరాక్రమ పరాయణులలో కూడా కనిపిస్తుంది. దీని సహకారంతో వారు అపారసంపదను సంపాదిస్తారు, యశోవంతులు అవుతారు. అనేక అనుచరులతో చుట్టబడివుంటారు. భీతావహ పరిస్థితులను ఉత్పన్నము చేయుటకూడా దీనిద్వారానే సంభవము. కపటము, అపరాధములయొక్క ఒక పెద్ద శృంఖల దీని ఆధారముగానే నడుస్తోంది. సామాన్య ప్రతిభాసంపన్నులైన ఇటువంటి అనేకమంది వ్యక్తులు కనబడుతూవుంటారు. దాన్ని ఆధారముగా చేసుకుని గొప్పతనాన్ని ప్రోగుచేస్తారు. అది అప్పటికప్పుడు

ఉపయోగపడే చిల్లరహుండీ లాగా తయారవుతుంది. మంచి వేతనము మీద అధికారముతో కూడిన లాభదాయక స్థితి వారికి లభిస్తుంది. కానీ ప్రఖరప్రతిభ దీనికి సర్వదా భిన్నముగా వుంటుంది. **ప్రఖరత యొక్క తాత్పర్యము ఆదర్శవాదీ ఉత్కృష్టత అని తీసుకోవాలి.** సజ్జనులు, సమర్పణ చేసుకున్న సాధువులు ఈ కోవలోకే వస్తారు. కర్తవ్యక్షేత్రములో వారు సైనికుల వలె అనుశాసనములను పాటిస్తారు. వీరినే దేవమానవులని అంటారు. ఓజస్వీలని, తేజస్వీలని, మనస్వీలని, వర్చస్వీలని, మహామానవులని, యుగపురుషులని ఈ స్థాయికి చెందిన వ్యక్తులు స్మరింపబడుతారు.

వీరిలో విశేషంగా ఉచ్చస్తరీయ భావసంవేదనలు వుంటాయి. శ్రద్ధ, ప్రజ్ఞ, నిష్ఠ వంటి తత్త్వములు వీరిలోనే కనిపిస్తాయి. సామాన్య ప్రతిభావంతులు కేవలము ధనమును, యశస్సును లేదా గొప్పదనమును తమ స్వార్థముకొరకు వినియోగిస్తారు. ఎవరికి ఎంత సఫలత వస్తే వారు తమకుతాము అంత గొప్పగా భావించుకుంటారు. ప్రజలుకూడా వారిచే ప్రభావితులౌతారు. ఏదో పొందాలనే కోరికతో ముఖస్తుతిపరులు చాలామంది వీరిచుట్టూ తిరుగుతూ వుంటారు. సామాన్య ప్రతిభ గలవారు అప్రసన్నులైతే ఇతరులకు నష్టమునుకూడ కలిగిస్తారు. అందుచేత వారు కలిగించే ఒత్తిడిని భరిస్తూ ఇష్టము లేకపోయినా అందరూ వారికి సహకరిస్తారు. ఇది సామాన్య ప్రతిభయొక్క వివేచనము.

**'ప్రఖర ప్రతిభ' సంకీర్ణ స్వార్థపరత కంటే చాలా ఎత్తులో వుంటుంది. దానికి 'మానవీయగరిమ'పైనే దృష్టివుంటుంది. ఆదర్శములపట్ల**



**అనన్యమైన నిష్ఠ సమావేశమై వుంటుంది. లోకకళ్యాణము మరియు సత్ప్రవృత్తి సంవర్ధన పట్ల దానికి గాఢమైన అభిరుచి వుంటుంది.**

ప్రఖరప్రతిభయొక్క దివ్య అనుదానములు ఒకవిధముగా దైవీ అనుగ్రహముగా లెక్కింపబడతాయి. సామాన్యులకు లోభ-మోహ బంధనములనుండి క్షణముకూడా విముక్తి లభించదు. కానీ ప్రఖర ప్రతిభాసంపన్నులు లోకుల, ప్రజల- సమస్యల గురించి మాత్రమే ఆలోచిస్తూ వాటికి సమాధానంకొరకు ప్రణాళికలు వేస్తూవుంటారు. భావనలు ఉద్భవించగానే ఇటువంటి వ్యక్తులు పెద్దపెద్ద త్యాగములు, పురుషార్థములు చేసి చూపించుటకు తత్పరులైవుంటారు. ఇటువంటివారు సాఫల్యము పొందలేకపోయినా సైనికులవలె గుర్తించబడతారు. దేవతల వలె పూజించబడతారు. ఒకవేళ వారు సఫలీకృతులవుతే చరిత్రనే మార్చివేస్తారు. ప్రవాహముల దిశను తలక్రిందులు చేయడమే వీరి పని.

ఆకాశము చాలా పెద్దది, కానీ నియమిత సంఖ్యలోనే అందులో నక్షత్రములు మెఱుస్తూ కనపడతాయి. అదేవిధంగా జనసముదాయము కూడా పొట్టకూటికోసమేతప్ప మిగిలిన వేటిగురించి ఆలోచించదు, కానీ ఎవరిపై దైవీ అనుగ్రహము వలె ప్రఖరప్రతిభ అవతరిస్తుందో, వారు చిరకాలము అసంఖ్యాకులకు అనుకరణీయములు, అభినందనీయములు అయ్యే క్రియా-కలాపాలు చేయగలుగుతారు.

స్వాధ్యాయము, సత్సంగము, ప్రేరణ, పరామర్శ మొదలైన

వాటిద్వారా కూడా సన్మార్గములో నడుచుటకు మార్గదర్శనము లభిస్తుంది, కానీ ఎవరిలో భావ-సంవేదనలు మొదటినుండి వుంటాయో వారు మాత్రమే ఆ ప్రేరణలను ఆచరణలో పెట్టగలరు. వారికి యే కొంచెము ప్రేరణ లభించిననూ క్రాంతికారీ పరివర్తనలు సమాజములో తేగలరు. ముత్యపుచిప్పలో ఒక్క నీటిబిందువు పడినా ముత్యముగా మారుతుంది, కానీ ఇసుకలో ఆ బిందువు పడితే అది తన అస్థిత్వమునే కోల్పోతుంది. ఆదర్శవాదపరమార్థములకు కూడా ఇదే వర్తిస్తుంది. చాలాసార్లు ఉపదేశకులలో కూడా ఆచరణ మాటలలో భూమ్యాకాశములంతటి తారతమ్యము కనిపిస్తుంది. భావనలలో ప్రఖరత ఉంటే వ్యక్తి తీరికలేని పనులలో నిండా మునిగిఉన్నా ఏదో విధంగా వీలుచేసుకుని, సమయము కేటాయించి, మనోబలమును పెంచుకుని తన సదాశయములకు ఎరువు, నీరు అందించి, వాటిని పెంచుకుంటాడు. తన సంపర్కంలోకి వచ్చినవారిని దారి చూపించుటయే కాక తన గాఢమైన భావసంవేదనలతో వారిని ఎంత ప్రభావితము చేస్తాడంటే వారు ఈ దిశలో ఎలాంటి పనినైనా చేయడానికి వెనుకాడరు.

మధ్యకాలములో రాజపుత్రుల కుటుంబములనుండి ఇంటికొకరు చొప్పున సైన్యములో చేరేవారు. బ్రాహ్మణ పరివారముల నుండి ఒక బ్రహ్మచారిని పరివ్రాజకులుగా సమాజమునకు దానము చేసేవారు. సిక్కు ధర్మములోకూడా ప్రతి ఇంటినుండి ఒక వ్యక్తిని సమాజసేవకుడిగా ఇచ్చే పరంపర వుంది.



ఇందుకొరకు వారికి అమృతమును రుచి చూపిస్తారు. అనగా దీక్ష ఇవ్వబడుతుంది. బౌద్ధ ధర్మము విస్తరిస్తున్న రోజులలో ఈ ఆధారము పైనే లక్షలమంది భిక్షువులుగా, భిక్షిణులుగా కార్యక్షేత్రములోకి దూకారు. నేడుకూడా సమాజము ఇలాంటిదే కోరుతోంది, ఇందులో చింతన, చరిత్ర మరియు వ్యవహారములలో అసాధారణ పరివర్తనయొక్క ఆవశ్యకత వున్నది. ఇందుకొరకు భావనాశీలురైన లోకసేవకులయొక్క ప్రఖరప్రతిభలు ఎంత ఎక్కువ సంఖ్యలో లభిస్తే, లక్ష్యపూర్తి అంత సులభతరమై, వేగవంతమవుతుంది. వారికి ఉన్నదాంట్లో సగము లేదా నాలుగోవంతు, ఎవరు ఎంత ఇవ్వగలుగుతే అంత '**సమయదానము-అంశదానము**' ఇవ్వాలి. నవసృజనయొక్క ఈ పుణ్యప్రక్రియలో ఎవరు ఎంత సంలగ్నమయితే అంత ఎక్కువ శ్రేయస్సు పొందుతారు.

సూక్ష్మజగత్తులో చాలాసార్లు ఆటు-పోటు లాంటి ఒడిదుడుకులు వస్తూవుంటాయి. ఒకప్పుడు స్వార్థపరులు, లాలసాపరులు, అపరాధులు, కుకర్ములు సమాజములో పెరుగుతూవుంటారు. వారు స్వయముగా కొంత లాభము పొందుతారు. తమ ప్రభావక్షేత్రములో అనేకులను సర్వనాశనము చేస్తూవుంటారు. దీనినే ఆసురీప్రవాహప్రచలనము అనికూడ అంటారు. కానీ ప్రవాహదిశ ఎప్పుడైతే మారుతుందో, అప్పుడు ఉచ్చఆత్మలకు కొరత వుండదు. ఒకేవిధమైన ఆలోచన అసంఖ్యాకుల మనస్సులలో ఒక్కసారి వుద్భవిస్తుంది. వారి

సామూహికశక్తితో సృజన స్థాయి పనులు ఎంత ఎక్కువ సఫలత పొందుతాయంటే అది చూచిన ప్రజలు ఆశ్చర్యచకితులు కాక తప్పదు, దానిని దైవీప్రేరణ అనడము అత్యుక్తి కానేకాదు.

21 వ శతాబ్దములో క్రొత్తప్రపంచ నిర్మాణము చేయుట అనే కఠినమైన పని చేయవలసి ఉంది. ఇందుకొరకు వ్యాపక పరిమాణములో ప్రఖర ప్రతిభలు వుప్పొంగి తూఫానులాగా విజృంభించాలి. దీని కొరకు అనేకమంది వ్యక్తులు పనిచేస్తారు. గాలిదుమారము-తూఫాను వచ్చినపుడు ఆకులు, తేలిక వస్తువులు, ధూళికణాలు ఆకాశాన్ని అందుకుంటాయి. దైవీప్రేరణ యొక్క అదృశ్య ప్రవాహము ఈరోజులలో ఇలాగే వస్తుంది, ఇందు నుండి సృజన సైనికుల విశాలమైన సైన్యము వెలువడి అణుబాంబులు పడిన తరువాత స్మశానంగా మారిన జపాన్‌ని అక్కడ నివసించేవారు అన్య దేశములతో పోలిస్తే ఎంతో సమృద్ధంగా తయారుచేశారో, అటువంటి చమత్కారములు చేస్తుంది. రష్యా, జర్మనీలుకూడా కొన్ని దశాబ్దులలోనే ఎటువంటి చమత్కారాలు చేసి చూపించాయంటే వాటిని అద్భుతములు మరియు ఇతిహాసములో అనుపమానములు అని అనవచ్చు.

దుర్బుద్ధి గడిచిన శతాబ్దులలో ఎన్ని సంకటములను తెచ్చిందో అందరికీ తెలిసినదే. రెండు విశ్వయుద్ధములు ఈ శతాబ్దులయందే జరిగినాయి. ప్రదూషణ ఎంత పెరిగిందంటే, గడచిన లక్షల సంవత్సరాలలో కూడా ఇంత పెరగలేదు. అడవులు నశించిపోయాయి. ఇసుక ఎడారులు పెరిగాయి. అపరాధముల



సంఖ్య రికార్డు సాధిస్తోంది. మద్య, మాంసములు, వ్యభిచారములు పాత రికార్డులను బ్రద్దలుకొట్టాయి. జనాభా పెరుగుదల అద్భుతస్థాయిలో వున్నది. జనసాధారణముయొక్క వ్యక్తిగత ఆచరణ దాదాపు భ్రష్టాచారస్థాయికి చేరుకున్నది, ఇలా చర్చ కొనసాగిస్తే మానవుడు సాధించిన వైజ్ఞానిక, భౌతిక, ఆర్థిక ప్రగతులు సమస్యలను, విపత్తులను, విభీషికలను మాత్రమే తెచ్చిపెట్టాయి అనిపిస్తుంది. అసలు ఒక్క శతాబ్దంలోనే ఇన్ని అనర్థములు తీవ్రవేగముతో ఇంత క్రియాశీల మెలా అయినవో చూస్తే ఆశ్చర్యము కలుగుతుంది.

ఇప్పుడు రాత్రి తరువాత సూర్యోదయము కాబోతోంది. రెండవస్థాయి ప్రవాహము మొదలవుతుంది. మనుష్యులలో అసంఖ్యాకంగా భావసంవేదనలు వుప్పొంగుతాయి. వీరందరూ సృజనగురించి, సేవగురించి, ఉత్థానముగురించి, ఆదర్శములగురించి ఆలోచిస్తారు. ఇందులో ఒక పెద్ద సముదాయము పైకి వుప్పొంగుతూ దృష్టిగోచరమవుతుంది. ఎండాకాలములో గడ్డిపరకకూడా ఎక్కడా కనిపించదు, కానీ వర్షము పడగానే సర్వత్రా పచ్చదనమే పరచుకుంటుంది. నవయుగముయొక్క దైవీప్రవాహము అదృశ్య వాతావరణములో తన ఊర్జను విస్తరించుకుంటుంది. ఫలితముగా ఎవరిలో భావసంవేదనా తత్త్వములు జీవించివున్నవో, వారంతా తమ సామర్థ్యము యొక్క మహత్వపూర్ణభాగము నవసృజనకొరకు వినియోగిస్తూ కనిపిస్తారు. తీరిక లేదని మరియు వనరులు లేవని

ఎవరూ తమ ఆత్మను మోసము చేయలేరు. వినేవారు కూడా ఈ మాటలు నమ్మరు. దారితప్పించే మాటలు చెప్పి మభ్యపెడుతున్నారని కూడా అనుకుంటారు.

21 వ శతాబ్ది మొదలయ్యింది. ఇప్పటికే ప్రజ్ఞయొక్క అతి చిన్న-పెద్ద ఉద్యానవనాల బీజములు మొలకెత్తినాయి, పెరుగుతున్నాయి. ఇవి నందనవనమునకు సమాన స్థాయితో పెరుగుతాయి, వీటిని కల్పవృక్ష ఉద్యానవనాలతో పోల్చవచ్చు.

శ్రేష్ఠ మానవుల బాహుళ్యమే సత్యయుగము. దీనినే స్వర్గము అంటాము. దుర్బుద్ధి విపరీతముగా వ్యాపించివున్న పరిస్థితే నరకము. నరకీయపరిస్థితులు అందులోనే ఏర్పడుతాయి. పతన, పరాభవములు, అనాచారములు దీని కారణంగానే వుత్పన్నమౌతాయి. సమయపరివర్తనతో పాటు సదాశయముకూడా పెరుగుతుంది. నవసృజనపట్ల అభిరుచి అందరిలోనూ కనిపిస్తుంది. మరియు ప్రఖరప్రతిభయొక్క దివ్యఆలోకము సర్వత్రా తన చమత్కారములను వుత్పన్నము చేస్తుంది. ఈ నాల్గవది అయిన ప్రతిభ యొక్క శక్తియే నవయుగ అధిష్ఠాత్రి అని చెప్పబడుతుంది.

**జీవితములోని ఒక్క క్షణమును కూడ కోట్లకోట్ల బంగారు మొహరీలతో కొనలేము, ఇటువంటి అమూల్య క్షణాలను వ్యర్థంగా పోట్టుకోవడంకంటే మూర్ఖత్వము ఇంకేముంది?**



## 6. నాలుగు చరణములు యుగధర్మము

21వ శతాబ్దిలో సామాన్యుల జనజీవితము నాలుగు అనుబంధముల మేలు కలయికగా వుంటుంది. 1. ఇంగిత జ్ఞానం(సమఝ్‌దారీ) 2. నిజాయితీ(ఇమాన్‌దారీ) 3. బాధ్యత(జిమ్మేదారీ) 4. సాహసము(బహాదూరీ). ఈ నాలుగు ఆదర్శములు నాలుగు వేదముల సారము. ధర్మమునకు ఇవే నాలుగు పాదాలు. అభినవ సమాజము మరియు పరిష్కృత వాతావరణముయొక్క నంరచన ఈ ఆదర్శములను స్వీకించుటవలననే నిర్మించబడుతుంది. నవయుగము యొక్క నీతిశాస్త్రము, ధర్మశాస్త్రములుకూడా ఈ నాలుగు సత్యములపైనే ఆధారపడివున్నాయి. వీటిని అవహేళన చేయడంవలననే అనేక దుర్భావనలు, దుష్ప్రవృత్తులు చిగురించాయి. వాటిని తొలగించుట ఈనాలుగింటిని ప్రతిష్ఠించుటవలననే సంభవమవుతుంది.

**<u>1. ఇంగిత జ్ఞానము (సమఝ్‌దారీ)</u>** ః- త్వరగా వచ్చే లాభము కొరకు వెంపర్లాడి భవిష్యత్తులో రానున్న దాని దుష్పరిణామాలు అర్థము చేసుకోకపోవుటనే తెలివిలేనితనము లేక ఇంగిత జ్ఞానము లేకపోవుట అంటారు. ఈ పరిస్థితే అనేక సమస్యలు, కష్టాలు, విపత్తులు, విభీషికలకు మూల కారణము. రాబోయేరోజులలో కనుక చేసే పనులవల్ల వచ్చే పరిణామములను దృష్టిలో వుంచుకుని దాని ప్రకారము అచరించగలిగితే ఎవరూ ఎటువంటి

కష్టమును ఎదుర్కొనవలసిన అవసరము రాదు. లేకపోతే భవిష్యత్తు అంధకారమయమవుతుంది.

పక్షులు కుప్పలుకుప్పలుగా తిండి సంపాదించుకోవాలనే లోభము వలలో చిక్కుకుంటాయి. చేపకూడా ఎరకోసము వచ్చి గాలెములో చిక్కుకుని ప్రాణాలు పోగొట్టుకుంటుంది. బెల్లపు పాకమున్నపాత్రలోకి ముందు-వెనుక చూడకుండా పడిపోయే ఈగలకు, రెక్కలు ఇరుక్కుపోయి దురతి పడుతుంది.

అసంయమపరులు, అనాచారులు, దుర్వ్యసనపరులు తత్కాలిక లాభమునే చూస్తారు, కానీ ఈ తప్పిదమువలన రాబోయేరోజులలో ఎటువంటి దుష్పరిణామాలు ఎదుర్కోవాలి అనే విషయము గమనించుకోరు. దృష్టిదోషము వున్నవారు దగ్గరలో వున్నవే చూడగలుగుతారు. దూరంగా వున్న ఏ వస్తువూ కనిపించదు. అందుచేత మాటిమాటికి ఎదురుదెబ్బలు తింటూ, తడబడుతూ, క్రిందపడుతూ వుంటారు.

ఈరోజులలో వ్యక్తి మరియు సమాజమునకు ఎదురుగా అనేక సమస్యలున్నాయి. వీటన్నింటికీ ఒకే కారణము తెలివిలేనితనము, ఇంగిత జ్ఞానము లేకపోవుట. అసంయమపరులు, ప్రమాదకరమైన పైపై మెఱుగులకు ప్రాధాన్యత నిచ్చేవారు, అహంకారులు, కేవలము ఉద్ధత కృత్యములలోనే లాభము చూసుకుంటారు. అసలు ప్రమాణికతనే వదిలేసి, మర్చిపోయి, దురలవాట్లకు బానిసలై తమ వ్యక్తిత్వమును హేయమైనదిగా మార్చుకుంటారు. చిత్రమైన స్థితిలో పడిపోయి పూడ్చలేని హానిని తమకు తావే



కలిగించుకుంటారు.

ఈరోజులలో తెలివిలేనితనము మహమ్మారిలాగా అందరి నెత్తిన ఆవరించివున్నది. భ్రష్టచింతనము, దుష్టఆచరణ ఈ కారణముగానే కల్గినాయి. మనఃస్థితియే పరిస్థితులకు జన్మనిస్తుంది, అది కనుక అవాంఛనీయమయితే తనకు, తనకు సంబంధించిన అన్యులకు అనేక రకములైన సంకటములను ఉత్పన్నము చేస్తుంది. తెలివైనవారి తెలివితక్కువతనమే అగణిత విపత్తులకు కారణమవుతుంది. మానవుడు దారితప్పిన దేవత అనేది సత్యము. తన భాగ్యమునుకూడా తనే నిర్మించుకుంటాడు. వ్యాపిస్తున్న ప్రవాహగతిని మార్చగలిగే పరిపూర్ణ సామర్థ్యము అతనికున్నది. అన్నివిధాల మనిషి దారితప్పడమునకు కారణము సరైన దిశాబోధ లేకపోవడమే. ఈరోజులలో విచారశీలురందరి దృష్టికోణము, పురుషార్థము ఒకే కేంద్రముపై కేంద్రీకృతమవ్వాలి. ఆదర్శముల పట్ల శ్రద్ధ మరియు తర్క, తధ్య, ప్రమాణములతో వివేకమును కూడా సమన్వయించగలిగితే తూఫానునుండి నావను దాటించుట చాలా సులభము.

**2. <u>నిజాయితీ (ఇమాన్‌దారీ)</u>** :- ఇతరులు మనపట్ల ఏవిధంగా ప్రవర్తించాలని కోరుకుంటామో మనముకూడా ఇతరులపట్ల ఆవిధంగానే ప్రవర్తించాలి. నిజాయితీకి ఇదే సమగ్ర పరిభాష. మనము ఇతరులనుండి స్నేహము, సహయోగము, సద్భావము, సద్వ్యవహారములను ఆశిస్తాము. సరిగ్గా అదేవిధంగా మనము ఇతరులతో వ్యవహరించాలి. నిజాయితీయొక్క సమస్త

ఉదాహరణలు ఈ సత్యమును నిరూపించుటలో సన్నిహితత్వము కనపరుస్తాయి. నీకు తప్పు అనిపించే ఆచరణ ఇతరుటపట్ల నువ్వు ఆచరిస్తే అదే నిజాయితీలేనితనము అవుతుంది.

మోసగించుట, కష్టము కలిగించుట, నిష్ఠూరములాడుట, అసభ్యముగా ప్రవర్తించుట, మనపట్ల ఇతరులు చేస్తే మనము సహించము. మరి అదే వ్యవహారము ఇతరులపట్ల మనము ఎందుకు చూపించాలి? ఎదుటివారి స్థానములో మనమే వుంటే వారినుండి మనము ఎటువంటి ప్రవర్తన ఆశిస్తాము? ప్రతి ప్రసంగములోనూ, ప్రతిక్షేత్రములోను ఈ గీటురాయిపై మనము నిజాయితీగా ఉన్నామా లేదా నిర్ణయించుకోవాలి.

నిజాయితీయే ధర్మము. దీనినే భక్తి, ధర్మము, జ్ఞానము, ఆధ్యాత్మికత, సాధన, తపశ్చర్యల సారతత్త్వముగా అర్థము చేసుకోవాలి. దీనికొరకు పెద్దపెద్ద గ్రంథాలు చదువవనవసరములేదు, విద్వాంసులను అడుగవలసిన అవసరమూ లేదు. దానికి సంబంధించిన సుయోగ్యమైన న్యాయమూర్తి కేవలము మన ఆత్మయే అవుతుంది. మనల్ని మనము ప్రతీసారి ప్రశ్నించుకోవాలి. మనల్ని మనవే పరిశోధించుకుని న్యాయము, సిద్ధాంతము ఎంతవరకు మనము ఆచరిస్తున్నామో చూసుకోవాలి. మనము ఎంత పరిశుద్ధముగా వున్నామో చూసుకుని అన్నే అంశాలలో మనము ధర్మాత్ములమని నిర్ణయించుకోవాలి.

ఇతరులు నిజాయితీ లేకుండా వ్యవహరించినా, మనము



మాత్రము ఆ కుచక్రములో నుండి మనల్ని మనము రక్షించుకోవాలి. అవినీతిపై ఆధారపడే వారికి నచ్చచెప్పట మొదలు, బలవంతముగా సరిచాయవచ్చు కానీ మనము కూడా ఆ వ్యక్తి స్థాయికి దిగజారిపోకూడదు.

**3. బాధ్యత (జిమ్మేదారీ)** :- మానవుడు స్వతంత్రుడుగా, స్వచ్ఛందముగా, స్వేచ్ఛాచారిగా తిరుగుతాడు. కానీ నిజానికి అతను చాలా బాధ్యతలలో బంధితుడు. అనేక అనుశాసనములు అతడు పాటించవలసి వుంటుంది. శరీరమును స్వచ్ఛంగా వుంచుకొనుటకు ఆహార, విహారాలలో మర్యాదలను పాటించాలి. మనస్సును సంతులితంగా ప్రమోదభరితముగా వుంచుకొనుటకు సద్భావనలనే అవధరించాలి. ఆర్థికసంకటములు పెరగకుండా నాగరికస్థాయిలో నిర్వహణ చూసుకోవాలి. కుటుంబములోని సదస్యులను సుయోగ్యులుగా, స్వావలంబులుగా, సంస్కారవంతులుగా వుంచుటకు అనవతరము ప్రయాసపడుతూ వుండటము వంటి అనుబంధములను సరైన రీతిలో పాటిస్తే ఎవరైనా సుఖముగా, సమున్నతులుగా వుండగలుగుతారు, మరియు తమ సంపర్కములోకి వచ్చినవారిని ప్రసన్నముగా వుంచగలిగే మర్యాద పొందుతారు. ఈ బాధ్యతలను ఎవరు ఉపేక్షిస్తారో, వారు అనాచరణములో చిక్కుకుని అనేక కష్టములు భరించవలసివుంటుంది.

నిజజీవితపరిధి నుంచి ఒక అడుగు ముందుకేసి సామాజికక్షేత్రములో ఉచ్చస్తరీయ భూమిక నిర్వహించుటకు

ముందుకు రావడము మానవీయ గరిమ పరిధిలోకొస్తుంది. 'వసుధైకకుటుంబకము' అనే మాన్యత ఆదర్శవాదమునందే గణించబడుతుంది. దుఃఖములను సుఖములను పంచుకోవడం, కలసిమెలసి జీవించడము, సుఖసాధనాలను కలసి వుపయోగించుకోవడం వంటి పద్ధతులు పాటించేవారు స్వయముగా శ్రేయోధికారులౌతారు మరియు అనేకులు అనుకరించుటకు ప్రేరకు లవుతారు.

స్రష్ట తన జ్యేష్ఠపుత్రుడిగా, యువరాజుగా మనిషిని సృష్టించాడు. మరియు సృష్టిని సువ్యవస్థితముగా, సమున్నతముగా, సుసంస్కృతముగా తయారుచేసే బాధ్యతను అప్పగించాడు. ఆ బాధ్యతను పూర్తిచేయుటకు నిరతుడైనప్పుడే అతను జీవిత లక్ష్యమును సాధించగలుగుతాడు. ఈ ఆధారముపైనే మానవుడు దేవమానవస్థాయిని పొందుతాడు. ఇంతతెలిసి లోభము, మోహము, అహంకారము అనే కుచక్రములో ఇరుక్కుంటే సురదుర్లభమైన సుయోగమును వ్యర్థముగా పోగొట్టుకున్నవాడవుతాడు, అది భయంకరమైన తప్పు అవుతుంది. ఇటువంటి బాధ్యతారాహిత్యము ఈరోజులలో ఎక్కడా కనిపించకూడదు.

**4. సాహసము (బహాదూరీ)**:- ఒక సమయములో ఎవరినైనా గెలిచినా, పడేసినా సాహసము, పరాక్రమము అనేవారు. బలవంతులు, బలహీనులపై విజయము సాధించి తమనుతాము యోగ్యులుగా, శూరవీరులుగా భావించేవారు.

21 వ శతాబ్ది - ఉజ్జ్వల భవిష్యత్తు - 2 51

ఇప్పుడు అటువంటి రీతులు మానవీయ గరిమగా స్వీకరింపబడుటలేదు. వ్యాఘ్రములు లేళ్ళను, కుందేళ్ళను వేటాడుతాయి. పెద్ద చేప చిన్న చేపను మ్రింగుతుంది. దురాచారులు, బలహీనులపై దమనకాండ సాగించి వారిని శోషణ చేస్తారు. డేగ జీవితమంతా పక్షిగ్రుడ్లను-పిల్లలను తింటూవుంటుంది. వీరిని ఎవరైనా శూరవీరులు అని అంటారా? బందిపోట్లు, హంతకులు, కసాయివారు నిత్యము మారణకాండ జరుపుతూనే వుంటారు. ఎందరి ప్రాణాలనో హరిస్తూవుంటారు. వారికి సాహసవంతులు అనే గొప్పదనాన్ని ఎవరు, ఎక్కడ, ఎప్పుడు యిచ్చారు?

సాహసము అంటే అతి ప్రాచీన, అర్వాచీన అర్థము ఒకటే. కాలము, సమాజము, సంస్కృతి దీప్తివంతముచేస్తూ వ్యక్తి గొప్పతనము పొంగి పొరలినప్పుడే దానిని సాహసము, పరాక్రమము అంటారు. ఇటువంటి పురుషార్థము చూపించుటకు ఇదే సరైన సమయము. సత్ప్రవృత్తి సంవర్ధన, మరియు దుష్ప్రవృత్తి ఉన్మూలన అనే రెండు పురుషార్థములకు ఇప్పుడు ఎంతటి ఆవశ్యకత వున్నదంటే ఇంతటి ఆవశ్యకత ఇంతకుముందు ఎన్నడూ లేదు. ఈ సందర్భముగా ఎవరు ఎంత సాహసము చూపగలరో, వారు యుగధర్మమును అంతగా అర్థము చేసుకుని, కాలముయొక్క పిలుపుని విని ముందు వరుసలో వచ్చేశారు అని తెలుసుకోవచ్చు.

దుష్కర్మలపట్ల నిరతులైనవారు అసంఖ్యాకముగా వున్నారు.

అంధవిశ్వాసము, అనాచారములకు కొరత లేదు, నీరు పల్లానికే ప్రవహిస్తుంది. మరియు ప్రవాహము పైనుండి క్రిందికి జాలువారుతుంది. నికృష్టత వైపు వెళ్లేవారి పూర్వజన్మల సంచితసంస్కారములు కూడా వారిని చెడుమార్గము వైపే తోస్తాయి. నేటి కాలప్రవాహములో దుష్ప్రవృత్తులే నిండివున్నాయి. చెడుసాంగత్యములు, అవాంఛనీయ వాతావరణముల దుష్ప్రభావము తక్కువ శక్తివంతమైనదేమీ కాదు. వీటన్నింటి సమన్వయముతో సామాన్యస్థాయి ప్రజలు పొట్టకూటికి, సంతానోత్పత్తికిమాత్రమే పరిమితమై హేయమైన జీవితము గడపవలసిన పరిస్థితి ఏర్పడింది. వీటన్నింటినీ ఎదుర్కొంటూ కూడా తమని తాము ఉచ్చస్తరీయ ఆదర్శవాదులుగా త్రిప్పుకోగలిగేటందుకు తత్పరులైనవారిని నిజమైన అర్థములో శూరవీరులు అనవచ్చు.

దుష్టజనులు తమతమ సమూహములను తయారుచేసుకుంటారు. పరస్పరము సహాయసహకారాలు చేసుకుంటారు. కాని సజ్జనులు వారి పనిలో మాత్రమే రుచి, తత్పరత చూపిస్తారు. లోకహితముయొక్క ప్రయోజనం కొరకు సంఘటితులై కటిబద్ధులగుట తప్పించుకుంటారు. వీరియొక్క ఈ ఒక్క బలహీనత మిగిలిన అన్ని గుణములను, సామర్థ్యములను పనికిరానివాటిగా చేస్తుంది. మన్యు **(వివేకపూర్ణ సాహసముతో కూడిన క్రోధము) యొక్క లేమియే దీనికి మూలకారణము.** సాహసంతోకూడిన పని ఏమిటంటే బుద్ధుని



ధర్మచక్ర ప్రవర్తన, గాంధీజీ సత్యాగ్రహ ఆందోళనలో పాలుపంచుకున్నవారి వంటి సజ్జనుల సముదాయమును ఒకచోటికి చేర్చుట. సాహసవంతులుగా హనుమంతుడు, అంగదుడు కొనియాడదగినవారు. మహామానవులు ఈకోవకే చెందుతారు. వారు తమ ఉత్కృష్టత, పరమార్థపరాయణత ఆధారముగా ఎటువంటి పనులు చేసి చూపిస్తారంటే వారి వెనుక ఏమైనా దైవీశక్తి తోడుగా వుండి ఇటువంటి చమత్కారము చూపిస్తోందా అనిపిస్తుంది.

ధర్మ - దర్శనము, అధ్యాత్మ-తత్త్వదర్శనము యొక్క అనేక నియమములు నిర్ధారితమైవున్నాయి. వాటి మధ్య వున్న అభిప్రాయభేదాలు, హెచ్చుతగ్గులు సాధారణముగా జనమానసములను ప్రభావితము చేస్తాయి. కానీ రాబోయే రోజులలో ఇవి పూర్తిగా మారిపోతాయి. **ఇంగిత జ్ఞానము, నిజాయితీ, బాధ్యత, సాహసము (సమఝ్‌దారీ, ఇమాన్‌దారీ, జిమ్మేదారీ, బహాదూరీ) యొక్క ఈ నాలుగు చరణముల పరిధిలోనే ఉత్కృష్టత యొక్క సమస్త సిద్ధాంతములు సమావేశమైవుంటాయి. ఇంత చిన్న ధర్మశాస్త్రము వలన్లే యుగానికి చెందిన సమస్యలకు సమాధానము లభించడము సంభవమే.**

రాబోయేరోజులలో ప్రత్యేకముగా విచారశీలురు ఆత్మనిరీక్షణ సాధనలో ఏదోవొక రూపములో సమ్మిళితము కావల్సివుంటుంది. పైన చెప్పిన నాలుగు మాన్యతలు అంతఃకరణములో ఎంత లోతుగా ప్రవేశించాయో గమనించి కార్యరూపము ధరించడానికి ఎంత శ్రమపడవలసివచ్చిందో పరిశీలించి ఏదైనా లోటువుంటే

XXXXXXXXXXXXXX

దానిని పూరించడానికి భావనాశీలురైన ప్రతివ్యక్తి రాబోయేరోజులలో నిరంతరము ప్రయత్నము చేయవలసివున్నది.

**నిన్ను నువ్వు సంస్కరించుకుంటే నీ సంపర్కములోకి వచ్చినవారు కూడా సంస్కరింపబడతారు, ఎవరినివారు సంస్కరించుకోలేని వారికి, ధర్మోపదేశమునిచ్చే అధికారము ఎక్కడుంటుంది?**

## 7. రాబోయే శతాబ్దికి అధిష్ఠాత - సూర్యుడు

ఈ బ్రహ్మాండములో భూమండల స్థాయికి చెందిన గ్రహము ఎంత వెతికినా కనిపించదు. ఇంత సుందరమైన, సువ్యవస్థితమైన, సునియోజితమైన, అగణితవిశేషతల స్థాయికి చెందిన గ్రహము ఎంత వెదికినా కనిపించదు. స్వర్గలోకముగురించి ఊహించవచ్చు, కానీ భూలోకములో వున్నన్ని విశేషతలు, విచిత్రములను స్వర్గలోకములో కూడా ఊహించలేము. ఇందుమూలంగానే 'స్వర్గాదపీ గరీయసి' అనే నానుడి వచ్చింది. మన సౌరమండలంలో ఎన్నో గ్రహములు, ఉపగ్రహములు కనుక్కోబడినవి. వాటిలో చాలా గ్రహాలు ఆకారము దృష్టితో చూస్తే పృథ్వి కంటే ఎన్నోరెట్లు పెద్దవి, కానీ ప్రాకృతికశోభ, ప్రాణిసముదాయము, వృక్షములు, వనస్పతులు మొదలైనవాటితో వుండే పృథ్వికి ధీటైన గ్రహము మరొకటి లేదు. ఋతువులయొక్క ఇటువంటి పరివర్తన అన్యత్రా



ఎక్కడా సంభవముకాదు. లెక్కలేనన్ని శక్తులు, విశేషతలు, విభూతుల భాండాగారముగా చెప్పబడుతున్న మనిషివంటి ప్రాణి ఇతరత్రా లభించుటకూడా సర్వధా దుర్లభమే. వీరిలో చాలామంది నిద్రాణస్థితిలోనే ఉండవచ్చుగాక.

అన్యగ్రహములతో పోలిస్తే చిన్నదైన పృథ్విలో ఇంతటి సౌందర్యము, సౌష్ఠవము ఏవిధంగా సంభవమయినాయి. ఇందుకు గల భౌతిక కారణాలను పరిశీలిస్తే ప్రముఖంగా ఒకే తథ్యము మనముందుకొస్తుంది. అదేమిటంటే సూర్యుడు పృథ్వినుండి ఎంత దూరములో వుండాలో సరిగ్గా అంతే దూరములో వుండటము వలన ఇటువంటి పరిస్థితులు సంతులన సంభవమయ్యాయి. ఒకవేళ దూరము తక్కువగా వున్నట్లయితే పృథ్వి అగ్నిపిండముగా మారిపోయేది. ఒకవేళ కొంచెం దూరంగా వున్నట్లయితే చలి అధికముగా వుండి ఎటువంటి కదలికలు దృష్టిగోచరమయ్యేవికావు. సునిశ్చిత దూరము అనే సుయోగమువలన భూమి ఇన్ని విశేషతలను సంతరించుకోగలిగింది. ఈ విశేషతలు బ్రహ్మాండములో ఎంత వెతికినా ఎక్కడా కనిపించవు.

తత్త్వదర్శులనుండి విజ్ఞానవేత్తలవరకు 'సూర్య ఆత్మ జగతః స్థుషస్చ' అనగా 'సూర్యుడు సమస్త జగత్తుకు ఆత్మ' అని ఒకే స్వరముతో ఒప్పుకుంటారు. పృథ్విపై ఆధిపత్యము సూర్యునికే ఇవ్వడింది. ఈ తథ్యమును పతి-పత్నీ, ప్రియురాలు-ప్రేమికుడు లాంటి అనేక అలంకారములతో వేదాలలో అభివ్యక్తము

చేయబడినది.

సూర్యుని కిరణములు భూమిపై పడినప్పుడు ఆ క్షేత్రములో ఉత్సాహము, పరాక్రమము ఉఱకలు వేస్తాయి. వనస్పతులలో, ప్రాణులలో, పదార్థములలో కదలిక మొదలవుతుంది. సూర్యుడు అస్తమించగానే అందరిని సోమరితనము, అలసట, నిద్ర, అకర్మశీలత ఆవరిస్తాయి. కదలికలు ఆగి విశ్రాంతస్థితికి వెళ్ళిపోతాయి. సూర్య కిరణములు ప్రసరించని ప్రదేశాలలో తేమ, కుళ్ళుట, నీరసము, నిస్తబ్దత ఆవరించి వుంటాయి. ఇటువంటి ప్రదేశాలలో విషాణువులు పెరుగుతాయి. ఎక్కడ సౌరఊర్జ ఎంత ప్రసరిస్తుందో అక్కడ అంత బలిష్ఠ, సుదృఢ వాతావరణము దృష్టిగోచర మవుతుంది.

శబ్దము, ప్రకాశము, వేడి అనేవి మూడు ప్రముఖ తత్త్వములుగా ఈ ప్రపంచములో చెప్పబడినాయి. అణువులు-పరమాణువులు మరియు వాటి ఘటకములతోపాటు తమతమ క్షేత్రములలో పరిభ్రమణము చేస్తూ నిరంతరము విభిన్న పదార్థముల స్వరూపములను ఈ తరంగములే, నిర్మిస్తూవుంటాయి. వస్తువులు అనేక రంగులతో కనిపిస్తాయి. ఈ రంగులు ఎక్కడనుండి వస్తున్నాయి? సమాధానము సుస్పష్టము, వస్తువులు లేదాచెట్లు తమ అనురూపమైన కిరణముల యందు విద్యమానమై యున్న రంగులను శోషించుకొని అదే రంగు గలవిగా అవుతాయి. రంగులను తయారు చేయగలిగేది సూర్యుడొక్కడే. ఆయనయే ఈ భూమిని విభిన్న



ఘటకాలతో తన ప్రణాళిక ప్రకారము చిత్రకారుడు లాగా రంగులతో నింపి తనలోని అద్భుత కళాకారుడిని మనకు పరిచయము చేశాడు.

పృథ్వీపై అనేక రసాయనాలు లభ్యమవుతాయి. వాటి ఆధారంగానే వనస్పతులు, ప్రాణులయొక్క శరీరాలు నిర్మించబడతాయి. ఈ రసాయనాలు కూడా సూర్యుడు మరియు పృథ్వీ యొక్క సంయోగము వలన తయారవుతాయి. వాటినే మనము ఖాద్యపదార్థములనుండి పదార్థజగత్తు వరకు అనేక ఇతర క్షేత్రములలో అంకురించి, పెరిగి తమదైనశైలిలో పనిచేస్తూ చూడవచ్చు. వైజ్ఞానికుల ప్రకారము పృథ్వీపై జీవనతత్త్వము ఎంత విద్యమానమై వుందో, ఎన్ని కదలికలు వున్నాయో వాటన్నింటి ఉద్గమకేంద్రము సూర్యశక్తితోనే సన్నిహితమైవుంటుంది. యాంగ్‌స్ట్రామ్ మరియు హ్యాగనిన్స్ వంటి వైజ్ఞానికులు తేల్చిన విషయము యేమిటంటే సూర్యప్రభయందు సోడియం, కాల్షియమ్, బేరియమ్, జింక్, కాపర్, ఐరన్, మేంగనీస్, కోబాల్ట్, క్యాడ్మియమ్ వంటి ధాతువులను నిర్మించగలిగే సామర్థ్యము వున్నది. మానవీయ జీవనీశక్తికూడా సూర్యునినుండి ప్రాప్తించిన అనుదానమే. దీని లేమివలననే మనిషి రోగగ్రస్తుడౌతాడు.

మానవుని శరీరములో అనేకానేక ప్రవృత్తులకు చెందిన జీవకోశికలు, ఊతకములు (ప్లెక్సెస్), క్షారములు, ప్రోటీన్స్, హార్మోన్స్, విటమిన్స్ మొదలైనవి లభిస్తాయి. ఇవన్నీ ప్రకృతియొక్క అనుదానాలుగా భావిస్తాము. సూక్ష్మదృష్టితో చూస్తే ఈ భిన్నతలు

ఆ ఆ స్థలాలలో సూర్యప్రభావము ఎంత స్థాయిలో, ఎంత పరిమాణములో, ఎంత వేగముగా పడుతోంది? అక్కడ ఏ ఘటకాలతో కలసి ఏ ప్రభావముతో మిశ్రితమై ఏ ప్రతిక్రియ వుత్పన్నము చేస్తోంది అనేదాని మీద ఆధారపడుతాయి. రసాయనాలతో పదార్థముల నిర్మాణము జరగడము చూస్తున్నాము. కానీ నిజానికి రసాయనాలు కూడ సూర్యకిరణముల ద్వారానే వుత్పన్నమౌతాయి.

సృష్ట్యాది మొదలు ఇప్పటివరకు పృథ్విపై వున్న వాతావరణంలో, ప్రాణులలో, పదార్థములలో, ఋతువులలో చిత్రవిచిత్రమైన పరివర్తనలు జరుగుతూవున్నాయి. ఇందుకు మూలము పృథ్వి మరియు సూర్యుని మధ్య జరిగే ఇచ్చిపుచ్చుకోవటాలు, వాటివల్ల వుత్పన్నమయ్యే ప్రతిక్రియలో మార్పు రావడమే ప్రముఖ కారణము. ప్రకృతియొక్క ప్రాకృతిక చరిత్ర ఏవిధముగా మారుతుందో, దానికి కారణమేమిటి అనేది శోధిస్తే బహిర్గతమైన సత్యమేమిటంటే రెండుగ్రహముల మధ్య వచ్చే మార్పులే ఈ ఎగుడుదిగుడులకు నిమిత్తకారకము.

భవిష్యత్తునుగురించి ఆలోచిస్తే సూర్యశక్తిని రాబోయేరోజులలో ఎంతవరకు, ఏవిధంగా వుపయోగించడము సంభవమవుతుంది అనేదానిపై దృష్టి సారించాల్సివస్తుంది. మానవునికి అన్ని ఆవశ్యకతలు 'శక్తి'(ఊర్జ)పై ఆధారపడినవే. భోజనము తయారీ, ఇటుకల తయారీ, సిమెంటు తయారీ, రసాయనాల తయారీ, ధాతువుల తయారీ, జలయానము,



భూయానము, వాయుయానములను నడిపించుట, కర్మాగారములను నడిపించుట, భూమినుండి నీరు వెలికితీయుట మొదలైన అనేక పనులకు ఇష్టానుసారము వాడే ఊర్జకు ప్రత్యామ్నాయము ఎక్కడి నుండి లభిస్తుంది? దీనికి ఏకైక ఆధారము సూర్యుడే అని ప్రత్యుత్తరమివ్వాలి.

సూర్యుని మెరుపుతో, వేడితో కూడిన ఒక రూపము అందరికీ పరిచితమే. రెండవది ఆధ్యాత్మిక స్వరూపము అది అంతః కరణములో ప్రేరణ, ప్రకాశము, సాహసము, ఉత్సాహము, పరాక్రమము ప్రసాదించుటతో సమర్థత కలిగివుంటుంది. దానిని ఆధ్యాత్మిక భాషలో 'సవిత' అని పిలుస్తాము. సూర్యుడు జడ అగ్నిపిండముకాదు. మీదుమిక్కిలి సచేతన ప్రాణశక్తి. ఆవాహనతో ఆకర్షించినట్లయితే అది సాధకునికి ఓజస్సు, తేజస్సు, వర్చస్సులను ప్రసాదించుటలో సమర్థత కల్గివుంటుంది. కుంతీదేవి ఈ శక్తిని ఆవాహన చేసి సూర్యపుత్రుడు అయిన కర్ణుడికి జన్మనిచ్చింది. కర్ణుని శరీరానికి, మనస్సుకి కవచ-కుండలముల రూపములో - ఈ సూర్య-సవితా శక్తియే పరిలక్షితమైనది. అనేక ఇతర సందర్భాలలో మన పురాణేతిహాసాలలో సూర్యుని మాధ్యమముగా ప్రాప్తించుకున్న సామర్థ్యములు వర్ణించబడి ఉన్నవి. రఘువంశీయుల ఉపాస్యదైవము సూర్యుడే.

నవయుగములో జనమానసములను సంస్కరించుటకు ప్రఖర ప్రతిభాసంవర్ధన ఎంతో ఆవశ్యకము. **మహామానవులను తయారుచేసి, వారిని వికసింపచేయుటకు సవితయొక్క చేతనశక్తి**

**ప్రయోగముమాత్రమే కోరదగినది. ఇందుకొరకు ఈరోజులలో ఉచ్చస్తరీయ ఆత్మలు తమ సూక్ష్మశరీరములతో విశేషప్రయోగములతో ప్రయత్నము చేస్తున్నారు.**

సార్వజనీన ప్రయోగరూపములో శాంతికుంజ్‌లో యుగసంధి సమయంలో ఇటువంటి మహాపురశ్చరణ జరిగింది. ఇది 1988 శరన్నవరాత్రుల నుండి మొదలుపెట్టి డిసెంబర్ 2000 వరకు జరుగుతుంది. దీని పూర్ణాహుతి తన తరహాలో అద్భుతముగా, వ్యాపకస్థాయిలో జరగనున్నది. సాధనావిజ్ఞానమందు శ్రద్ధ కలిగినవారు శాంతికుంజ్‌లో జరిగే నెలరోజులు, తొమ్మిది రోజుల సత్రములకు వచ్చి యుగసంధి పురశ్చరణ యందు భాగస్వాములు అవుతున్నారు.

ఈరోజులలో అణ్వాయుధాలనుండి వుత్పన్నమయ్యే రేడియో ధార్మికతను ఎలా ఎదుర్కొనాలి, అనే విషయముపై ప్రసిద్ధ దార్శనికుడు ఆర్థర్ కౌస్లర్ కూడ ఆధ్యాత్మిక వుపచారములనే ఆశ్రయించాలని చెప్పాడు. బ్లిట్జ్ పత్రిక సంపాదకులు శ్రీకరంజియాకి ఆయన చెప్పిన విషయములను ప్రసిద్ధ పత్రిక ''నవనీత'' (మార్చి 1983)లో ప్రచురించింది. తన అభిప్రాయము తెలుపుతూ ఆయన, 'అణుఆయుధాలకంటే ఎక్కువ సామర్థ్యము సావిత్రి-సవితా మంత్రమైన గాయత్రీమంత్రములో వున్నది' అన్నారు. ఆయన విశ్వములోని కోట్లాది భారతీయులు గాయత్రీ మంత్రమును ఏకోచ్చారణతో పురశ్చరణరూపముగా చేసినట్లయితే, ఆ అనుష్ఠానమునుండి వుత్పన్నమైన ఊర్జ, బ్రహ్మాండములోని సూర్యునికూడా భేదించగలిగే మిసైల్ అంత పనిచేస్తుంది. ఇంకా



'భర్గ' తో కలసి అణుశక్తిని కూడ నాశనము చేయగలదు.

ప్రాచీనకాలంలోని ఋషుల వలె రాబోయేరోజులలో ఈ కాలానికి చెందిన తత్త్వజ్ఞానులు అనుభవపూర్వకముగా మానవమానసము ప్రకృతిలోకూడ ఈ మహాశక్తి ఉపయోగించి అవసరమైన పరిష్కారాలు, పరిమార్జనలు, పరివర్తనలు చేయుట సంభవమని తెలుసుకుంటారు. సూర్యపురాణము, అక్షుణ్యోపనిషత్తు, ఆదిత్యహృదయము మొదలైనవాటిలో సూర్యునియొక్క విశిష్టక్షమతలు, సామర్థ్యము గురించి చెప్పబడినది. మరియు వాటిద్వారా జరిగే అనేక చికిత్సలకు సంకేతాలు ఇవ్వబడ్డాయి. శరీరము, మనస్సు మరియు భావ సంవేదనలకు ఈ శక్తిద్వారా ఉచ్చస్తరీయ లాభములను అందచేయవచ్చును. ఈ ప్రతిపాదనలకు సంబంధించి జరిగే పరిశోధనలు కాదనజాలనివిగా పరీక్షించబడుట అనే గీటురాయిపై సరియైనవే అని నిరూపించబడతాయి. రాబోయేరోజులలో సూర్యవిజ్ఞానమే ప్రముఖపాత్ర వహిస్తుంది. మీదుమిక్కిలి మానసోపచారముగా కూడా పనికొస్తుంది. సూర్యనమస్కారములు, సూర్యభేదన ప్రాణాయామములు, సూర్యోపస్థానముల విధి ఉపచారముల అనుమానరహిత పరిణామములు అందరి ముందు వున్నాయి. దీనివల్ల సూర్యశక్తిపై విశ్వాసము పెరుగుతుంది.

ఎవరికి ఈ ప్రతిపాదనలపై దృఢవిశ్వాసము వున్నదో వారికొరకు సార్వజనీన ఉపాసనా విధానము తయారు చేయబడినది. అది ఈప్రకారంగా వుంటుంది. బ్రహ్మ

ముహూర్తములో నిద్రలేచి యథాశక్తి శరీరము మనస్సులను శుద్ధిపరచుకొని కనులు మూసుకుని ప్రాతఃకాలంలో ఉదయిస్తున్న స్వర్ణిమసవితను ధ్యానము చేయాలి. ఆ స్వర్ణిమ సూర్య కిరణములు తమ శరీరముల లోపలికి ప్రవేశించడము వల్ల వాటి స్థితి చంద్రుని వలె అవుతున్నదని భావన చెయ్యాలి. సూర్యునినుండి ప్రకాశమును గ్రహించిన చంద్రుడు మెరుస్తూ, తన శీతల ప్రకాశముతో రాత్రిని ప్రకాశింపజేసి అమృతమును కురిపిస్తాడు. ధ్యానస్థితిలో భావన ఎలా ఉండాలి అంటే సూర్యకిరణములు సాధకుని శరీరములో ప్రవేశించినాయి. శరీరములోని అంగ ప్రత్యంగములలో చంద్రుని అమృతజ్యోతి నిండిపోయింది. ఈ జ్యోతి ప్రపంచమంతా వ్యాపించి అమృతజ్యోతితో నిండిన వాతావరణమును నిర్మిస్తోంది. దానితో పదార్థములు, ప్రాణులు అనుప్రాణితమవుతున్నాయి. ఉపయోగకర వాతావరణములు నిర్మించబడుతున్నాయి. అవాంఛనీయతలు తొలిగిపోతున్నాయి.

గాయత్రీమంత్రము సూర్యమంత్రము. ఎవరికి గాయత్రీ మంత్రముపై శ్రద్ధ వుంటుందో వారు పైన చెప్పిన ధ్యానముతోపాటు గాయత్రీమంత్రమును మానసికంగా జపించవచ్చు. ఎవరికి మంత్రజప విధానము నచ్చదోవారు కేవలము సూర్యకిరణములను తమ శరీరములోకి ఆవాహనచేసి దానిమూలముగా తయారయ్యే చంద్రోపమశరీరముతో అమృతజ్యోతి వితరణ ధ్యానమును మాత్రమే చేసుకుంటూ ఉండవచ్చు.



దీనికొరకు 15 నిమిషాలు సమయమే నిర్ధారించబడినది. కారణము అందరూ దీనిని ఆచరించుటకు వీలుగా వుండాలి. ఒకేభావన ఒకే సమయములో లక్షల, కోట్లమంది కలిసి చేస్తే ఆ సంయుక్తశక్తి నుండి ఉద్భవమయ్యే సూర్యచేతన మానవసమాజముపై అధిక అనుగ్రహమునుకురింపిచగలదు, ఇటువంటి నమ్మకము మనకు వుండాలి.

**మనము మంచి అవకాశములకై ఎదురుచూడకూడదు.**
**సాధారణ సమయాన్ని మంచి అవకాశముగా మార్చుకోవచ్చు.**

## 8. మహాకాలుని సంకల్పిత సంభావనలు

మానవునికి ఆలోచనాత్మకశక్తి, సామర్థ్యము, శ్రద్ధ, సాహసము, ఉత్సాహము, పురుషార్థపరాయణత వంటి శ్రేష్ఠగుణములకు లోటులేదు. ఈవిధమైన మానసికవిభూతులు కలిగివుండటము వలన అతను చేసే సామాన్యమైన పనులు, ప్రక్రియలు అసామాన్యముగా దైవీవిభూతులతో సరితూగేవిధంగా వుంటాయి. అయినప్పటికి అతని కార్యక్షేత్రముయొక్క సాఫల్యము కొన్ని హద్దులకి, నిర్ధారిత సమయమునకు మాత్రమే లోబడి వుంటుంది. ఒకవేళ అదృశ్యప్రగతి ప్రవాహముయొక్క ఇచ్ఛాశక్తి కూడా అతని ప్రయత్నాలకు తోడైతే ఆశ్చర్యకరస్థాయిలో పరివర్తన వేగవంతమౌతుంది. వేలాది సంవత్సరాలలోకాని జరగని పనులు

సంవత్సరాలు, దశాబ్దులలో, నెలలలోనే సంపన్నమౌతాయి. ఈ అదృశ్యక్రమము అనాయాసముగా ఏమి జరగదు. ఒక విశేష ప్రణాళిక, ప్రేరణలలోని భాగముగానే జరుగుతుంది. దానికి వెనుక అవ్యవస్థను తొలగించి వ్యవస్థను తయారుచేసే లక్ష్యము సన్నిహితమైవుంటుంది.

హోరుగాలితో తూఫాను వస్తే పేరుకుపోయిన చెత్తాచెదారము ఎక్కడికో కొట్టుకుపోతుంది. గోతులు పూడుకుపోయి భూమి సమతలంగా తయారగుట ఎంతో వేగముగా క్షణాలలో జరుగుతుంది. ఇసుక ఎడారులలోని దిబ్బలు-పర్వతాలు ఈరోజు ఇక్కడున్నవి రేపు ఎక్కడికో స్థానాంతరణ చెందడము తెలిసిన విషయమే. మేఘాలు వర్షించినప్పుడు విశాల భూభాగమంతా జలముతో నిండిపోయి కనిపిస్తుంది. అస్తవ్యస్థముగా వుండే గుడిసెల ఆచూకీకూడా తెలియదు. పెద్దపెద్ద వృక్షములుకూడ పడిపోతాయి. అంతకు కొద్దిసమయానికి ముందు ఊహకుకూడా అందని పరిస్థితులు ఏర్పడతాయి.

గడచినరోజులపై దృష్టిసారిస్తే ప్రాచీన కాలమునాటి పరంపరలన్నీ ఆమూలాగ్రముగా పరివర్తన చేయబడే ఘటనాక్రమము రచింపబడినట్లు విశదమౌతుంది. భారతదేశము వేల సంవత్సరాలుగా అనుభవిస్తున్న బానిసబంధనాలు చిన్న తేలికపాటి ఆందోళనతోనే తెంపివేయబడ్డాయి. భూపతుల మని చెప్పుకునే వారినినుండి అధికారము లాగివేయబడినది. బలహీనులైన, ప్రజలకు భూమి అప్పగించబడినది. పెద్ద వృత్తివలె ప్రచారము పొందిన దాస-దాసీల క్రయ-విక్రయములు, లూటీలు,



అపహరణల జాడ ఇప్పుడు ఎక్కడా లేదు. చనిపోయిన భర్తల శవములపై జీవించియున్న భార్యలేకాక, ఉంపుడుకత్తెలనుకూడ తగులబెట్టేవారు లేదా పూడ్చేవారు. కానీ ఇప్పుడు అటువంటి రీతివివాజులనుగురించి చెప్పటముకూడ నిషిద్ధవే. అస్పృశ్యతయొక్క పాత స్వరూపము ఎక్కడా కనిపించడములేదు.

విజ్ఞాన మనే తరంగము ఉవ్వెత్తున లేచి 2, 3 శతాబ్దాలలోనే రైలు, మోటారు, జలయానము, వాయుయానము, విద్యుచ్ఛక్తి మొదలైనవి పృథ్వియొక్క మూలమూలలకు తమ ప్రభావమును పరిచయము చేయుట ప్రారంభించాయి. అంతరిక్షములో ఉపగ్రహములు తిరుగట మొదలైనది. రేడియోలు, టెలివిజన్‌లు మంచి విశిష్టత గల మాధ్యమము లైనాయి. రాకెట్లు ఎంత వేగము పుంజుకున్నాయంటే అవి భూమియొక్క ఒక చివరనుండి రెండవచివర వరకు తిరుగుతున్నాయి. రోబోట్లు మానవీయశ్రమ స్థానమును ఆక్రమించుకుంటున్నాయి. కంప్యూటర్‌లు మానవమస్తిష్కమును పెదవివిరిచి వెక్కిరిస్తున్నాయి. ఇక అణ్వాయుధాలు లక్షల, కోట్ల సంవత్సరాలలో తయారైన సమృద్ధ, సుందరపృథ్విని క్షణములో భస్మము చేసి ధూళిగా మార్చి అంతరిక్షములో అదృశ్యము చేయగలవు. ప్రగతియొక్క ఈ విపరీత వేగమును చూస్తే ఆశ్చర్యముతో వివశులమై పోవలసి వస్తున్నది.

ఇది గడిచిన కాలముయొక్క విశ్లేషణ. ఇక వర్తమానముపై దృష్టిసారిస్తే 21 వ శతాబ్దియొక్క శుభసంభావనలు అంకురిస్తున్న పచ్చని పచ్చిక వలె కనిపిస్తున్నాయి. కాలముయొక్క ఆవశ్యకతను

గుర్తించి ప్రతిభను మనుష్యులు తమంతతామే పరిష్కరించుకోక నిర్లక్ష్యము వహించినా వసంతఋతువులో పుష్పములు తమంతతామే పల్లవించే విధంగా ఆ ప్రతిభ తనను తానే అనాయాసముగా పరిచయము చేసుకుంటున్నదా అనిపిస్తోంది. నరనరాల్లో నిండియున్న పీనాసీతనము, లోభము, కోరికలపైన ఎవరు అంకుశమును ప్రయోగిస్తున్నారో తెలియదు. కానీ మదించిన ఏనుగును కుశలుడైన మావటివాడు ఎలా లొంగదీసుకుంటాడో అలానే ఇప్పుడు జరుగుతోంది. భగీరథుడు, సప్తఋషులు, బుద్ధుడు, శంకరుడు, దయానందుడు, వివేకానందుడు, గాంధీ, వినోబాల చరిత్రలు పునరావృత్తమయి మన ముందుకు రాగలుగుతాయా లేదా అనే అనుమానమువల్ల ఈనాడు ఎక్కడ చూసినా పరిస్థితులలో నిరాశే బలపడుతున్నా ఇంతమాత్రానికే నియతియొక్క పరివర్తన, ప్రత్యావర్తనల సామర్థ్యము సమాప్తమయ్యిందని విశ్వసింపరాదు. మహాకాలుని హుంకారములు దశదిశలను ప్రతిధ్వనింప జేస్తూవుంటే వినకుండా ఎలా వుండగలము? యుగచేతనయొక్క ప్రభాతవేళలో వుదయించిన స్వర్ణిమసవిత యొక్క వెలుగును ఎలా మర్చిపోగలము? యుగఅవతరణయొక్క సంభావన గంగావతరణ వలె అద్భుతమైనదే, కానీ ఒకనాడు సిద్ధించినది పునరావృత్తమగుటకు అసమర్థస్థితిలో వుందని ఎలా అనుకోగలము? యుగసంధియొక్క వర్తమానస్థితి ఇటువంటి ఒడిదుడుకులతో నిండివున్నది.

1989, మే నెలలో అనుకోకుండా గ్రామపంచాయతీలకు విశేష



అధికారము ఇవ్వాలనే ప్రతిపాదన పెట్టబడింది. గ్రామీణస్వరాజ్యము అనేది ఆరంభదినాలలో గాంధీజీ కల. దానిపై చర్చలు జరుగుతుడేవి, ప్రణాళికలు వేయబడేవి, కానీ 1989 లోని కొద్ది మాసములలోనే దీనిపై ఇంతటి క్రాంతికారీ పరివర్తన ఇంత సరళముగా జరుగుతుందని ఎవరూ ఊహించలేదు. రక్తము చిందకుండా, దూషణలు, తిరుగుబాట్లు తలెత్తకుండా రాజ్యపరివర్తన ఎక్కడ జరుగుతుంది? కానీ సమర్థుల చేతిలోంచి జారి ఈ శక్తి నిర్ధనుల, వెనుకబడినవారి చేతులలోకి ఇంత తేలికగా ఎలా వెళ్ళగలిగింది? ఇది మానవులకు మింగుడుపడని విషయము. కానీ ఇది సంభవమైనపుడు దానిని ఎలా కాదని త్రోసిపుచ్చగలము?

వెనుకబడినవారు సంకల్పించిన స్థాయికి చేరుకోవడము అసాధారణము, కష్టసాధ్యము సమయసాధ్యము. వెనుకబడిన వారికి అశిక్షితులైన వారికి మరియు అణిచివేయబడిన మహిళలకు ఇంత త్వరగా రక్షణ కల్పించబడుట సరైనదే అని తెల్సినప్పటికీ ఇంత తొందరగా జరుగుతుంది అని ఎవరనుకున్నారు. దీనినే ఉప్పొంగిన మానవీయ అంతరాళమనిగాని, మహాకాలుని విధివిధాన మనిగాని ఏది చెప్పినా, అసంభవమును ఇదే సంభవముగా మారుస్తుంది.

కానీ ఈ పొంగు తరువాత పరివర్తనయొక్క పరుగు ఆగిపోతుందా? ఎవరూ ఇలా అనుకోకూడదు. దీనితరువాత క్రొత్త మేఘముల వలె సహకారీఆందోళనలు, క్రాంతులు చిగురించి, అవి భ్రష్టాచారమును తరిమికొట్టి, దానికి నిలువనీడలేకుండా

చేయుట దూరదర్శులు మాత్రమే చూడగలరు.

మధ్యవర్తులు 94 శాతము మింగివేసి ఉపభోక్తలకు కేవలము 6 శాతమే ఇస్తారు. ఇంతటి పెద్ద విపత్తునుండి ఏ ఆధారముతో బయటపడాలి? ఎవరి గర్జింపులలో రక్తదాహము అనే నిషా నిండివున్నదో వారికి ఎలా నచ్చచెప్పి ఆ దారినుండి మళ్ళించగలము? దీనికి సమాధానము ఒక్కటే. గుఱ్ఱమునకు కళ్ళెము బిగించినట్లు, ఒంటెకు ముక్కుత్రాడు వేసినట్లు, ఏనుగును సరైన దారిలో నడిపించడానికి అంకుశము ప్రయోగించినట్లుగా సహకారము ఆధారముగా ఆర్థికవ్యవస్థను నడిపిస్తే ప్రగతిప్రణాళికలను మ్రింగుతు బలంపుంజుకుంటున్న మొసలివంటి అత్యాచారములకు నిలువనీడ వుండదు.

రాజ్యక్రాంతులలో పంచాయతీ రాజ్యము దాని పరిణామములను చూస్తూవుంటే అద్భుతముగా అనిపిస్తుంది. వెనువెంటనే వచ్చేది సహకారితాక్రాంతి, ఇదికనుక సరైన విధానములో సార్థకమవుతే ధనము దళారుల కబంధహస్తములనుండి విముక్తిపొందటవేగాక కొద్ది సమయములోనే ఆ దళారీవ్యవస్థ తన అస్తిత్వమును కోల్పోతుంది.

శిక్షాక్షేత్రములో ప్రౌఢశిక్ష అనేది గొంతులో అడ్డుపుల్లలాగ తయారవుతోంది. ఎవరి చేతులలో ఈ సమాజపుకళ్ళెములు వున్నాయో వారు అశిక్షితులుగా పనికిరానివారుగా ఉండిపోవడము ఎంత బాధాకరమైన విషయము. ఇంతపెద్ద వ్యవస్థకొరకు



ప్రభుత్వధనమును, సహాయమును ఆశించలేము, పైగా చదువుకునేవారు విద్యార్జన చేయాలనే అభిరుచి లేనివారు కావచ్చు, ఈ సమస్యకు పరిష్కారముగా రాబోయేరోజులలో చదువుకున్నవారు తమ సమీపములోని అశిక్షితులలో ఒకరిద్దరిని ఎన్నుకుని వారికి తప్పనిసరిగా విద్య నేర్పించితీరాలి అనే ప్రతిపాదన రావాలి.

అనీతిసంపాదన తినేవారు అపరాధులుగా, తిరస్కరింప బడినపుడు, రెండవవైపు శ్రమశీలురను పుణ్యాత్ములుగా పరిగణించి వారికి గౌరవమర్యాదలు ఇవ్వబడినప్పుడు ఉపార్జన, అభివర్ధన యందు కొంచెమైనా యోగదానము ఇవ్వక అటూ, ఇటూ ఏదో చెప్పి తప్పించుకొనేవారు తుడిచిపెట్టుకుపోతారు. పాఖండులు, అనాచారులు, నిరుద్యోగులు సాధారణముగా ఇలాంటి ముసుగులలోనే దాగి ఉంటారు.

శ్రమించి సంపాదించినదే గ్రాహ్యమైనది అని గ్రహించినప్పుడు కట్నాలు, ఆడంబరాలు, అపవ్యయము, అహంకారము మొదలైన అనేక అవ్యవస్థల మూలకారణములు తుడిచిపెట్టుకుపోతాయి. కుర్చీలో అధికారమును వెతుక్కునేవారు అప్పుడు సుత్తి-పారలను వుపయోగించవలసి వస్తుంది, ముసలివారు కూడ అవమానము పొందకుండా ఎంతోకొంత చేయటానికి ముందుకొచ్చి తమను తాము ఏదోవిధంగా ఒక వ్యాపకములో వుంచుకుంటూ అధిక ఆరోగ్యముతో, ప్రసన్నముగా వుండి అధిక గౌరవమును పొందుతారు. దొంగలలో పనిదొంగలు చాలా నీచులుగా

గుర్తింపబడతారు.

**ఈ క్రాంతులన్నీ రైలుపెట్టవలె ఒకదాని వెనుక ఒకటి వరిగెడుతూ వస్తున్నాయి. అవి ద్రుతగతితో వట్టాలపై పరిగెట్టటం కళ్ళున్న ప్రతివారు చూడగలరు.** అవాంఛనీయ కోరికలనుండి విముక్తులయి సామాన్య నాగరికుల స్థాయిలో నిర్వహణ చేసుకునేవారికి ఎంతో శ్రమ, సమయము, వైభవము మిగులుతాయి, వీటిని నవసృజనకొరకు వినియోగిస్తే 21 వ శతాబ్దితో ముడిపడియున్న సుఖదసంభావనలు సఫలీకృతమవడము త్వరలో మన కళ్ళతో ప్రత్యక్షంగా చూడవచ్చు. నియంత యొక్క అభిలాష ఏమిటంటే మానవులలో అధికశాతము ప్రతిభావంతులుగా ముందుకు రావాలి. తమ చరిత్ర మరియు కర్తృత్వములతో అనేకులకు అనుకరణీయ ప్రబలప్రేరణను ఇవ్వగలగాలి.

యుగసంధియొక్క ఈ 12 సంవత్సరాలలో అంకురము గా మొదలై వృద్ధిచెంది నీడనిచ్చే వృక్షాలుగా ఎదిగి శోభాయమానముగా కనిపించేందుకు ప్రారంభ మరియు అనివార్య సంభావనలకు ఇవి కొన్ని సంకేతాలు మాత్రమే. వీటి సహాయముతోనే వినాశకర విభీషికల గర్జన-తర్జనలతో భయపెడుతున్న సమస్యల భారము కొంత తేలికపడుతుంది. ఈ మాత్రం జరిగినా విశ్వఉద్యానవనము పల్లవించే అవకాశము లభించి, బ్రహ్మకమలము వంటి పుష్పములు వికసించడానికి, అమరఫలముల వంటి వరదానములు వృద్ధిపొందడానికి



అవకాశము ఏర్పడుతుంది.

మనలో ప్రతి ఒక్కరికి, నవయుగ భవనములు నిర్మించబడుతున్నాయి, నిర్మించబడతాయి అనే సంపూర్ణ విశ్వాసము ఉండాలి. రాబోయేకాలము ఉజ్జ్వలభవిష్యత్తుతో ముడిపడియున్నది అనేది జ్ఞప్తిలో వుంచుకోవాలి. ఇందుకు అవరోధములు కల్పించేవారు దుర్గతిపాలవుతారు.

ఎప్పుడైతే విశ్వాత్మ, పరమాత్మ నవసృజనసంకల్పము తీసుకున్నాడో, ఇది పూర్తి అవుతుంది అనుటలో ఎటువంటి సందేహము లేదు. **21 వ శతాబ్దము ఉజ్జ్వలభవిష్యత్తు అనే ఉద్ఘోష కేవలము ఒక నినాదముమాత్రమే కాదు. దీని వెనుక మహాకాలుని ప్రచండ సంకల్పము సన్నిహితమైవున్నది. అది ప్రతిభావరిష్కారూపములో చరితార్థమవుట మనం చూస్తాము. రాబోయేరోజులలో ఈ బొగ్గుగనులనుండే బహుమూల్య మణిమాణిక్యాలు ఉద్భవించి మెరుస్తూ కనిపిస్తాయి.**

**గొప్ప కార్యములు చేపట్టేముందు గొప్ప ఆలోచనలు ఉత్పన్నమౌతాయి, అంటే గొప్ప ఆలోచనలు లేకపోతే గొప్ప కార్యములు జరుగనే జరగవు.**

# 9. పరివర్తన ప్రక్రియయొక్క సంక్షిప్త సారము

- 19 వ శతాబ్ది ఆరంభమునుండి 20 వ శతాబ్ది చివరి చరణము వరకు కాలచక్రము చాలా వేగముగా తిరిగింది. ఈ అవధిలో జరిగిన మంచి-చెడులు గడిచిన వేల సంవత్సరాలలో ఎప్పుడూ జరుగలేదు.

- ప్రగతిపేరుమీద అసాధారణ మహత్వముగల ఆవిష్కారములు, బుద్ధి తీక్ష్ణత వహించిన ప్రతిపాదనలు, శిక్ష, చికిత్స వంటి అనేక క్షేత్రములలో క్రొత్త నిర్ధారణలు, విశాలమైన అందమైన పరిశ్రమలు ఈరోజులలోనే నిర్మించబడ్డాయి. యుద్ధసామగ్రి ఉత్పత్తి ఒక క్రొత్త వృత్తిగా వృద్ధిచెందుట, అంతరిక్షములో అన్వేషణ ఈ సమయముయొక్క ఉపలబ్ధులే. ఇదే సమయములో అనేక రాజ్యక్రాంతులు కూడా సంభవించాయి. భారతదేశముతోసహా అనేక దేశములకు ప్రాప్తించిన స్వాతంత్ర్యము మొదలైన అనేక ఉపలబ్ధులనుకూడా ఈ వరుసలోనే చెప్పుకోవాలి.

- 20 వ శతాబ్దములో చెడు కూడా ఇంతకంటే తక్కువేమి జరుగలేదు. అవి దుఃఖకరములు కావని చెప్పలేము. రెండు ప్రపంచయుద్ధములు ఈ సమయములోనే జరిగాయి. జపాన్‌పై అణుబాంబుకూడ వేయబడినది. చిన్నచితక 100 యుద్ధములు పైగా ఈ సమయములోనే జరిగాయి. మత్తుపదార్థముల వాడుక చివరి హద్దుకు చేరుకున్నాయి. వ్యభిచారము పాపముగాకాక ఒక సామాన్య లోకాచారముగా తయారయ్యింది. దీనివలన



కుటుంబవ్యవస్థకు పెద్ద అఘాతమే కలిగింది. జనసంఖ్య అసాధారణముగా పెరిగిపోయింది, అనంయమముగా, అనాచారముగా ప్రవర్తించుట ఫ్యాషనైపోయింది. ప్రకృతి ప్రకోపాలు పతాక స్థాయికి చేరుకున్నాయి. కురీతులు, మూఢమాన్యతలు సభ్యఅసభ్యములను ఒకేగాటికి కట్టివేశాయి.

- అనౌచిత్యమును ఆపుటకు, వికాసక్రమమును పెంచుటకు ఏదో ఒకటి జరుగుతూనేవున్నది, కానీ విశిష్ట ప్రగతి సాధించుటలో, అవినీతిపై అంకుశము ప్రయోగించుటలో కించిత్ సాఫల్యముమాత్రమే పొందగలిగింది. రాష్ట్రసంఘము, ప్రభుత్వ వికాసకార్యములు మరియు సంస్థలను బాగుచేసే కార్యక్రమాలు కాలచక్రముయొక్క గతిశీలతపై సంతులన సాధించుటలో పట్టు సాధించలేకపోయాయి. మొత్తముమీద 20 వ శతాబ్దములో నష్టము ఎక్కువ జరిగినది. ఈ విషయమును భవిష్యవేత్తలు, దూరదర్శులు, ముందునుండి చెప్తూ, హెచ్చరిస్తూనేవున్నారు. ఏసును నమ్మేవారి 'సెవెన్‌టైమ్స్', ఇస్లాంను నమ్మేవారి '14వ శతాబ్దము', భవిష్యపురాణములో చెప్పబడ్డ వినాశము, వికృతి మొదలైనవి అన్నీ కలిపిచూస్తే తెలిసినది ఏమిటంటే విభీషికలు తమ వికారాల రూపము చూపిస్తున్నాయి.

- కాలచక్రముయొక్క క్రమము ఎటువంటిదంటే క్రిందినుండి పైకి వెళుతూ ఒక గోళము వలె తయారవుతుంది. 20 వ శతాబ్దముయొక్క నష్టము 21 వ శతాబ్దములోనే పూరించబడుతుంది. ఇందులో వికాసము అభివృద్ధి చెంది, వినాశము అనే కందకము పూడ్చివేయబడుతుంది. అందుచేతనే

'21 వ శతాబ్దము - ఉజ్జ్వల భవిష్యత్తు ' అనే ఉద్ఘోష ఉజ్జ్వల పరిస్థితులకు పరిచయవాక్యముగా చెప్పబడుతోంది.

ఈ తథ్యమును బలోపేతము చేస్తూ అనేక దివ్యదర్శులు, ఆంకలనకర్తలు(అంచనావేసేవారు) మరియు పాశ్చాత్యప్రతిభావంతులు ఒకే స్వరముతో దీనిని సమర్థిస్తున్నారు. మనముకూడ రాబోయే శతాబ్ది క్రొత్త వాతావరణము తీసుకొస్తుందని ఆశిద్దాము.

- రాత్రి వీడ్కోలుకు, ప్రభాత ఆగమనమునకు మధ్య కాలమును సంధిసమయము అని పిలుస్తారు. ఉషఃకాలము, బ్రహ్మముహూర్తము అని ఈ సమయమునే అంటారు. 20 వ శతాబ్దము యొక్క చివరి 12 సంవత్సరాలు యుగసంధి సమయముగా ప్రమాణీకరించబడినది. 1989 నుండి 2000 వరకు గల 12 సంవత్సరాలు ఈ కాలముగానే అవగాహనకి తెచ్చుకోవాలి. దీనిని చలి మరియు వేడి మధ్య వచ్చే వసంతకాలముతో లేదా వేడి మరయు చలి మధ్య వచ్చే వర్షాకాలముతో పోల్చవచ్చు. ఈ అవధిలోనే కరిగించుట, మూసపోయుట అనే రెండు పరస్పర విరోధి క్రియా-ప్రక్రియలు జరుగుతూవుంటాయి. అవాంఛనీయతలను ఉన్మూలనము చేసే ఉత్సాహము పెల్లుబుకుతుంది, నవసృజనయొక్క భవ్యప్రవాహము జాలువారుతుంది. ఇది మనము చూస్తాము. సంధికాలముయొక్క మహత్వము అసాధారణమైనదిగా చెప్పబడింది. ధాన్యమునకు మధ్యలో మొలకలు వస్తాయి. రెండు చక్రముల బండికి ఇరుసు ప్రధానపాత్ర పోషిస్తుంది. ప్రాతఃకాలము కాగానే ఇళ్ళు శుభ్రము



చేయబడి, వండుకోవటానికి పొయ్యి వేడి చెయ్యబడుతుంది. ఈ రెండు ప్రయోగాలు యుగసంధి మధ్య కాలములో క్రొత్త పద్ధతులలో నూత్న ఉత్సాహముతో కార్యాన్వితము చేయబడతాయి.

- ఈ రెండు విధానాలతో పోరాడుటకు ప్రఖరప్రతిభలు సృజనశిల్పుల రూపములో ఉద్భవించి ఎటువంటి పరాక్రమము చూపిస్తాయంటే అది అసాధారణముగా గుర్తింపబడుతుంది. ప్రతి పనీ మధ్యమగతిలో నిరంతరము జరుగుతూనే వుంటుంది. కానీ విశేష సమయములో, విశేషముగా శ్రమపడవలసివుంటుంది. అరుణోదయకాల మందు స్వర్ణిమ సూర్యుడు విశేషరూపముతో శోభాయమానముగా ప్రకాశిస్తాడు. అరుణోదయకాలమందలి పక్షుల కిలకిలారావములు, పుష్పించిన మొగ్గలు, మందిరములలోని శంఖనాదాలు, ధ్యాన పరంపర కొనసాగడం లాగా, ప్రతి క్షేత్రములో కొత్త పద్ధతులు క్రొత్త కదలికలు కనిపిస్తాయి.

- ప్రాణవంతులైన కర్మయోగులు, ఉగ్రసిద్ధికొరకు తమలో క్రొత్త ఉత్సాహం వృద్ధిచెందుట చూడగలరు. వారు సంఘర్షణ మరియు సృజన అనే రెండు కార్యములలో తమ పురుషార్థమును, హనుమంతుడు మరియు అంగదుని వలె చూపిస్తారు. వీరు లంకాదమనము, రామరాజ్యము నందలి సత్యయుగ సృజనకొరకు తమని తాము పూర్తిగా అర్పించుకున్న వారు. ఈ విధమైన భావనలతో అనుప్రాణితమైనవారు అసంఖ్యాకులు కనిపిస్తారు, ఎలుగుబంట్లు-కోతులు, గ్రద్ద(జటాయువు), ఉడుత, పడవ నడిపే సరంగు (గుహుడు), శబరి వలె అల్పశక్తిమంతుల

పాత్ర కూడా చూడ ముచ్చటగా ఉండబోతోంది. ప్రఖరప్రతిభలు యుగసృజేతల వంటి చారిత్రిక పాత్రలను పోషిస్తాయి. యుగసంధియొక్క ఈ 12 సంవత్సరాలలో ఈ ఉత్సాహము ఉరకలువేస్తూ, చిందులు వేస్తూ కనిపిస్తున్నది. స్వార్థమును త్రుంచివేసి పరమార్థమును సాధించుటకు ప్రతిప్రాణవంతుడు పోటీకి సిద్ధపడతాడు.

- శుభాగమనము మరియు అశుభ పలాయనము యొక్క చిహ్నములు ఈ యుగసంధి దినములలో అంకురిస్తాయి. 21 వ శతాబ్దిలో నవయుగమనే వటవృక్షము పెరిగి పరిపక్వమవుతూ కొద్ది సంవత్సరాలలో ఎంత ప్రౌఢతను పొందుతుందంటే దానికి ముందుకాలముతో పోల్చేవారు ఆ ఖ్యాతిని ఏకస్వరముతో నవయుగమని చెప్తారు.

- నవయుగములో సముద్రమంథనము లాంటిదే జరుగబోతోంది. అందులో సమయానుసారము 14 రత్నములు వెలికివస్తాయి. విజ్ఞానము దైత్యుల వైపు మరియు ఆధ్యాత్మికత వైపు దేవతలు కలసి సముద్రమంథన కార్యమును సంపన్నము చేస్తారు. ప్రకృతి మంధరాచలపర్వతము వలె చిలికే పని చేస్తుంది. మానవీయ ఉత్సాహము వాసుకిసర్పము పాత్ర ధరిస్తుంది. దివ్యప్రేరణల అదృశ్య సహయోగము కూర్మావతారము ధరించి వీటన్నింటి భారమును తన వీపుపై ధరిస్తుంది.

- రాజ్యశక్తి, బుద్ధిశక్తి, ధనశక్తి యొక్క మహిమ, మహత్వముల గురించి అందరికీ తెలుసు. నవయుగావతరణకొరకు నాల్గవశక్తిగా ప్రఖరప్రతిభ వుద్భవిస్తుంది. దానిని భావసంవేదనలతో నిండిన



ఆదర్శవాదీయ తరంగమని చెప్పవచ్చు. ఇది సుసంస్కారవంతులైన స్త్రీ-పురుషులందరినీ మేము మారుతాం-యుగం మారుతుంది(హమ్ బదలేంగే-యుగ్‌బదలేగా) అనే ఆదర్శముతో అనుప్రాణితము చేస్తుంది.

- మానవధర్మరూపములో ఇంగిత జ్ఞానము, నిజాయితీ, బాధ్యత, సాహసం (సమఝ్‌దారీ, ఈమాన్‌దారీ, జిమ్మేదారీ, బహాదూరీ) లకు సార్వభౌమ మాన్యత, గుర్తింపు లభిస్తుంది. దీని తత్త్వదర్శనమే నవయుగానికి ధర్మశాస్త్రమవుతుంది మరియు నిత్యజీవన వ్యవహారములోకి తీసుకురాబడుతుంది.

- పరివర్తనాప్రవాహము యుద్ధోన్మాదమును తగ్గించి, శాంతి-సహయోగముల వాతావరణమును నిర్మిస్తుంది. ఈరోజులలో ఇరాన్, ఇరాక్, కంపూచియా, నమిబియా, అంగోలా, పనామా, నికారాగు మొదలైన ప్రదేశాలు చలికి గడ్డకడుతున్నాయి. మనోమాలిన్యము కల క్షేత్రముల ప్రవృత్తులు మారాయి. ఈ క్రమము ఇలానే కొనసాగుతుంది.

- విజ్ఞానము ఇప్పటి లాగా యుద్ధసాధనముల పోటీకి వుపయోగించబడదు. పెద్ద నగరాలు, పెద్ద పరిశ్రమలు ఉపయోగ పడవని తెలుసుకుంటారు. కుటీరపరిశ్రమలు స్థాపించబడితే గ్రామీణవికాసములో క్రొత్త ఒరవడి మొదలవుతుంది. విజ్ఞానము, పెట్టుబడి మరియు కుశలతల పైనే దృష్టి కేంద్రీకరింపబడటంవలన ప్రదూషణ, క్రిక్కిరిసిన పట్టణాలు, అస్తవ్యస్థత, నిరుద్యోగము వంటి ప్రముఖ సమస్యలకు సమాధానము లభిస్తుంది.

- జనశక్తి తన ప్రగతికి సంబంధించిన ఆవశ్యకతలను తన స్వశక్తితోనే సాధించుకుంటుంది. అనుదానాలను, అనుగ్రహాలను ఆశించకుండా సమయదానము, అంశదానముల సహాయముతో సర్వతోముఖీ ప్రగతికొరకు ఏ ఆధారములు అవసరమో వాటిని ఏవిధమైన కష్టము లేకుండా సమకూర్చుకొని పెంచుకుంటుంది.

- సముద్రజలమును త్రాగునీటిగా మార్చుట, సూర్యశక్తిని ఊర్జ స్రోతముగా ఉపయోగించుకొనుట, ఇవి రెండు 21 వ శతాబ్దియొక్క ప్రధాన ఉపలబ్ధులు, ఎడారులు సస్యశ్యామలముగా పంటభూములుగా మార్చబడతాయి.

- తెలివితేటలు పెరగడముతోపాటు జనసంఖ్యవృద్ధి యొక్క అనౌచిత్యము అందరికి అర్థమయ్యేలా వివరించడంవల్ల అమర్యాదిత పుట్టుకలు సమాప్తమైపోతాయి. ఇప్పటి జనసంఖ్యలో సగభాగమైన స్త్రీలు ఉపేక్షతో వెనుకబడి జరుగుబాటులేక పడివున్నారు. రాబోయే శతాబ్దులలో స్త్రీ-పురుషులు సమానమై తీరుతారు. ఫలితంగా జనశక్తి ద్విగుణీకృతమవుతుంది.

- ఐక్యత మరియు సమత్వం యొక్క ఔచిత్యము అర్థము చేసుకుని పాటించబడతాయి. సంప్రదాయము, క్షేత్రము, భాష, జాతి మొదలైనవాటి పేరుమీద జరుగుతున్న వైషమ్యాలు నశించిపోతాయి. ఒకే ధర్మము, ఒకే జాతి, ఒకే భాష లాంటి మాన్యతలు గౌరవనీయమైనవిగా గుర్తింపబడి వ్యాపకమవుతాయి.

- సాహిత్యము, సంగీతము, కళలలో నిష్ణాతులు భావనలను మరియు ఆలోచనా విధానాన్ని సంస్కరించే ప్రణాలికలు తయారుచేస్తారు. అన్నింటికంటే ముఖ్యమైనది ఏమిటంటే



మానవుని చింతన, చరిత్ర, వ్యవహారము మారుతుంది. అందులో మానవీయ గరిమపట్ల శ్రద్ధ సమాహితమైవుంటుంది. మరియు వర్జనీయములపట్ల అందరూ సావధానులై వుంటారు. వ్యక్తివాదముతో కూడిన సంకీర్ణస్వార్థపరత పట్ల తిరస్కారవైఖరి ప్రబలుతుంది, దాని స్థానములో సమాజనిష్ఠ, మరియు పరమార్థపరాయణతలు శ్రేయము ప్రాధాన్యత సంతరించుకుంటాయి.

- భావి సంభావనలలో కొన్ని మాత్రమే ఇక్కడ ఉల్లేఖించబడ్డాయి. స్థానీయ పరిస్థితులు, నమ్మకాల కనురూపంగా అందరిలోనూ అభీష్టపరివర్తన వచ్చితీరుతుంది. మరి ఎవరు దీనిని సాధిస్తారు? దీనికి ప్రత్యుత్తరమొక్కటే. జాగృతమానవులలో అసంఖ్యాకుల మహత్వకాంక్షలు ఈ దిశ వైపుకే మరల్చబడి, వారు యుగపరివర్తన అనే మహాసుయోగము నందు తమ భూమికను అగ్రస్థానములో వుంచుకుంటారు. యుగసృజేతల రూపములో అనుకరణీయ, అభినందనీయ, ఐతిహాసిక భూమిక పోషిస్తారు.

- సేవ మరియు సృజనపట్ల ఉత్సాహము తుఫాను వలె వేగము పుంజుకుంటుంది. సవరించే క్రియాకలాపాలు స్థానీయ పరిస్థితులు, ఆవశ్యకతలు మరియు సాధనల కనురూపముగానే వుంటుంది. ఎటువంటి దేవమానవుల సమూహాము తయారవుతుందంటే వారిలా ప్రతి ఒక్కరూ జీవం ఉన్న సంస్థల వలె ఆలోచించి పనిచేయుటకు కటిబద్ధులై వుంటారు. ఈ పరివర్తన యొక్క వాస్తవిక శ్రేయము అదృశ్య వాతావరణము యొక్క నియంత, అభినవవ్యవస్థాపకునకు లభిస్తుంది. కాని ప్రతి

క్షేత్రముల యొక్క అన్ని స్థాయిలలోని మూర్ధన్యులుకూడ శ్రేయము పొందుతారు. రాజనైతిక, సామాజిక, ధార్మిక, ఆర్థిక సంస్థలు కూడా ఆ శ్రేయమునుండి వంచించబడవు. తమతమ భూమికల కనుగుణముగా అందరు కీర్తిని పొందుతారు.

- నవయుగ సంభావనలు కపోలకల్పనలుగా భావించి అపహాస్యము చేసేవారు, నిష్క్రియులుగా వుండేవారు బహుకొద్దిమంది మాత్రమే వుంటారు. ఇలా విఘ్నములను, అడ్డంకులను కల్పించి త్రిప్పికొట్టాలనే ఆవేశపరుల సంఖ్య ఎప్పుడు తక్కువ కాదు, కానీ చివరి విజయము మాత్రము సృజనదే. వెలుగునకే అభినందన లభిస్తుంది, సత్యయుగ పునరాగమన సుఖదసంభావనలు రాబోయేరోజులలో సాకారమై తీరుతాయి.

- ఈ అసంభవమును సంభవము చేసి చూపే అగ్రగాములు తమ ప్రతిభను, ఏవిధముగా, ఏ పరిధిలో చూపగలుగుతారో అది నవయుగముయొక్క అద్భుత ఉపలబ్ధిరూపములో చూచుట, అర్థము చేసుకొనుట, గణింపబడుట జరుగుతుంది.

**భవిష్యత్తుపై చింతను వదలివేయాలి.**
**దానివల్ల ఏ కార్యము సిద్ధించదు.**
**ఒకవేళ చింతన చేయాలంటే చరిత్రను ఉన్నతి వైపు**
**తీసుకువెళ్ళేందుకు చేయాలి.**

మహాపూర్ణాహుతి పుస్తకమాల - 1

# 21 వ శతాబ్ది - ఉజ్జ్వల భవిష్యత్తు - 2

**ద్వితీయ భాగము**

ప్రథమ ముద్రణ : 2000 ప్రతులు
2008 - ఉగాది

మూల్యము : 10/-

అక్షరకూర్పు : శ్రీమతి రాజ్యలక్ష్మి, శ్రీమతి లక్ష్మిగోపాల్, శ్రీమతి వల్లీప్రసాద్
డిజైన్ : వై.హెచ్.ఎస్.ప్రసాద్, హైదరాబాద్.

ప్రకాశకులు : హిందీ: **యుగనిర్మాణయోజన, గాయత్రీ తపోభూమి,** మథుర

ముద్రణ మరియు ప్రతులకు :

**గాయత్రి చేతనా కేంద్రము**

అశ్విని హౌస్ దగ్గర, హెచ్.పి.రోడ్, మూసాపేట్, హైదరాబాద్-500018.
ఫోన్స్ : 040-23700722, 32986922, 09392506888
E-mail : hyderabad.ap.in@awgp.org, info@aswini.com

## క్రాంతిధర్మీ సాహిత్యము యొక్క 20 పుస్తకములు

1. ఇరవైఒకటవ శతాబ్ది - ఉజ్వలభవిష్యత్ - 1 (ఇక్కీస్వీసదీ బనామ్ ఉజ్వలభవిష్య్-భాగ్1)
2. ఇరవైఒకటవ శతాబ్ది - ఉజ్వలభవిష్యత్ - 2 (ఇక్కీస్వీసదీ బనామ్ ఉజ్వలభవిష్య్-భాగ్2)
3. యుగేచ్ఛ - ప్రతిభా పరిష్కారము - 1 (యుగ్ కీ మాంగ్ ప్రతిభాపరిష్కార్-భాగ్1)
4. యుగేచ్ఛ - ప్రతిభా పరిష్కారము - 2 (యుగ్ కీ మాంగ్ ప్రతిభాపరిష్కార్-భాగ్2)
5. సత్యయుగ పునరాగమనము (సత్‌యుగ్ కీ వాపసీ)
6. పరివర్తన యొక్క గొప్ప క్షణములు (పరివర్తన్ కే మహాన్ క్షణ్)
7. జీవన సాధన యొక్క స్వర్ణిమసూత్రములు (జీవన్ సాధనాకే స్వర్ణిమ్ సూత్ర్)
8. ప్రతిభల కొరకు మహాకాలుని ఆహ్వానము (మహాకాల్ కా ప్రతిభావోం కా ఆమంత్రణ్)
9. ప్రజ్ఞావతారము యొక్క విస్తారప్రక్రియ (ప్రజ్ఞావతార్ కీ విస్తార్ ప్రక్రియా)
10. నవసృజనము కొరకు మహాకాలుని ఏర్పాట్లు (నవసృజన్ కే నిమిత్త్ మహాకాల్ కీ తైయారీ)
11. నేటి సమస్యలకు రేపటి సమాధానము (సమస్యాయే ఆజ్ కీ సమాధాన్ కల్ కీ)
12. మనఃస్థితి మారితే పరిస్థితులు మారతాయి (మనఃస్థితి బదలే తో పరిస్థితి బదలే)
13. ప్రఖరప్రజ్ఞ - స్రష్ట యొక్క పరమ అనుగ్రహము (స్రష్టా కా పరమ్ ప్రసాద్ ప్రఖర్ ప్రజ్ఞా)
14. ఆద్యశక్తి గాయత్రి యొక్క సమర్థసాధన (ఆద్యశక్తి గాయత్రీ కీ సమర్థ్ సాధనా)
15. శిక్షే కాదు విద్య కూడా (శిక్షా హీ నహీ విద్యా భీ)
16. సంజీవనీ విద్య యొక్క విస్తరణ (సంజీవనీ విద్యా కా విస్తార్)
17. భావసంవేదనల గంగోత్రి (భావ్ సంవేదనాఓం కీ గంగోత్రీ)
18. మహిళా జాగృతి అభియానము (మహిలా జాగృతి అభియాన్)
19. జీవన దేవతా సాధన - ఆరాధన (జీవన్ దేవతా కీ సాధనా - ఆరాధనా)
20. సమయదానమే యుగధర్మము (సమయదాన్ హీ యుగ్ ధర్మ్)